శ్రీరస్తు.

శుభమస్తు.

శ్రీవిఘ్నరాజాయనమః.

# ధీరంజని

అనునీకపటు వేదాంత కుఠారమును

శ్రీసిద్ధిగణేశ్వరప్రసాద సమాలబ్ధానవద్యవిద్యావైభవ
నీలివంశోద్భవ రంగిరామాఖ్యతృతీయతనూభవ
పెంచెలాహ్వయప్రణీతంబై

లేఖకప్రమాదజనితదోషంబులు లేకుండునటులఁ

పండితులచే పరిశోధింపఁబడి

వైశ్యకులతిలకులగు

మ-రా-రా|| శ్రీ, బచ్చు - నరసింహులుసెట్టిగారి వలన

చెన్నపురి

ఆనందముద్రాక్షరశాలయందు

రాంకితమై ప్రకటింపఁబడియె.

# పీ ఠి క.

సుజనులారా!

ఈ కాలంబునఁగొందఱు జ్ఞానహీనులయి పూర్వాచారపరాయణులుగాక చెడిపోవుచున్నారుగదా. "కలౌదానమ్మేకమ్మ్యతే" యని యార్యులువచించియున్నారు. దానము మనుజున కైహికాముష్మిక సాధనంబగుచున్నది. దానము వలన యశములభించుచున్నది. లోకంబున దానముకంటె నెక్కుడగు ధర్మముగానరాదు. మున్ను సత్పురుషుల నేకులు దానముసేసి సద్గతినొందినటులఁ బురాణాదులు సాక్ష్యములుగానున్నవి. మఱియు దానస్వరూపంబిట్టిదని దెలియ నెవ్వరు సమర్థులగుదురు. అయినను దానములలో నుత్తమోత్తముగఁ జెప్పఁబడినదెద్దియన నన్నదానమనియే బెద్దలునుడువుచున్నారు. దీనులయి యన్నకాంక్షులగువారికి నన్నమొసంగుటయే గృహస్థులకు పరమధర్మము. ఈ యన్నదానమె సద్గతికిని సాధనమగుచున్నది. ఇప్పుడీ కలికాలంబున దానము నామావశిష్టముగాఁ గనుపట్టుచున్నది. అదియట్లుండ సాధువులమని పేరిడుకొనిన కొందఱు దానంబుసేసినఁ బునర్జన్మంబు గల్గునని యుఁ దత్వజ్ఞానంబుననె సద్గతిలభించుననియు ననేకప్రకారంబుల జనులకు బోధింపుచు, వారిలదాన విముఖులంజేయుచు విషయసుఖంబులకొఱకు కుటిలవర్తనులై వేదాంతులమని లోకుల భ్రమింపఁ జేయుచున్నారు. అట్లుబోధించు కపటగురువులు సద్గతికిఁ దెరువుఁజూపువారలెగదా. వారుకావించు

తత్త్వబోధయు నట్టిదయగును. కాన లోకహితంబపేక్షించి యనుభవసిద్ధములై మున్ను పెద్దలచే నుడువంబడిన నీతులనుఁ బురాణేతిహాసాంతర్గతంబులగు కొన్ని ధర్మంబులను సంగ్రహించి దూర్వాసాంబరీష సంవాదరూపంబగు నీ ధీరంజని యను పొత్తమొకదాని రచియించినాఁడ. ఇం దంబరీషుఁడు దూర్వాసునితో దానప్రశంస సేయుటయు, కమఠభూసురసంవాదంబును, శ్వేతుఁడను రాజర్షి చరిత్రంబును, గపటగురుప్రశంసయును, నన్నదాన మహిమానువర్ణనంబును జేర్పంబడియున్నవి. కాఁబట్టి సునీతిమార్గోపదేశంబగు నీగ్రంథం బాద్యంతంబీక్షించి పండితులగువారు నెరసులున్న క్షమింతురని ప్రార్థింపుచున్నాను. ఈగ్రంథముం బరోపకార ధురీణులును, సుజనహితులును, దీనజనకల్పకులును, వైశ్యకులశేఖరులునగు మ - రా - రా - శ్రీ, బచ్చునరసింహులుసెట్టిగారు తోడ్పడి ద్రవ్యసహాయమొనర్చి యచ్చుగూర్పించి ప్రకటించిరి.

ఇట్లు

సుజనవిధేయుఁడు,

☞ నీలి - పెంచలయ్య,

పోలీసు ఆఫీసరు

నెల్లూరు, నవాబుపేట.



శ్రీరస్తు.

శ్రీగణపతయేనమః.

# ధీ రం జ ని.



క. శ్రీనొసఁగుయశము వెంచు న
నూనప్రమదంబుఁ జేయు నురుదోషంబుల్
వ్రోనడఁచుఁగరమువిమల
జ్ఞానము మెరయించు సాధుసంగతిదలఁపన్.

క. ధీరంజని యోగాంజని
ధీరంజని పరమతత్త్వదివ్యాంజని యీ
ధీరంజని యఘభంజని
ధీరంజని సకలసుజనధీరంజనియౌ.

తా. సర్వయోగములనుఁ బరమతత్త్వ రహస్యార్థములను నెఱుంగుటకు నంజనముఁబోలినదియు, సమస్తపాపముల నిర్మూలనము సేయునదియు, సజ్జనులహృదయములను వికసింపఁజేయునది యగు నీధీరంజని సత్పురుషు లగువారలు చదివికొని యానందింతురుగాత.

వ. మఱియును.

శ్లో॥ యత్సారస్వతవైభవంగురుకృపాపీయూషపాకోద్భవమ్।
తల్లభ్యంకవినైవనైవహఠతః పాఠప్రతిష్ఠాజుషా।
కాసారే దివసంవసన్నపిపయఃపూరం పరంపంకిలమ్।
కుర్వాణః కమలాకరస్య లభతే కింసౌరభం సైరిభః॥

తా. గురుకృపయనెడి యమృతపాకమందుఁ బుట్టిన విద్యావైభవము విద్వాంసునిచేఁ బొందఁదగినదియగుఁగాని యాకస్మికముగా స్వతంత్రించి చదివినవానిచేఁ బొందఁదగినదికాదు. దున్నపోతు తామరకొలనియం దొకదినమంతయుండినను నానీటిని బురదసేయునుఁగాని పద్మాకరసంబంధమైన పరిమళముఁ బొందఁగలుగదు.

వ. కావున విద్యాసంపదను సత్పండితులెఱుఁగుదురుగాని తక్కినవారలు గుర్తెఱుఁగరు.

శ్లో॥ బుధాగ్రేనగుణాన్బ్రూయాత్ సాధువేత్తియతస్స్వయం।
మూర్ఖాగ్రేపిచనబ్రూయాద్బుధప్రోక్తాన్నవేత్తిసః॥

తా. ఏకారణమువలనఁ దాను సర్వమును లెస్సగా నెఱుఁగుచున్నాఁడో యట్టి పండితునియెదుట గుణంబులఁ జెప్ప నక్కఱలేదు. మూర్ఖునియెదుట సజ్జనులచే నుడువంబడు గుణంబులనుఁ జెప్పనక్కఱలేదు.

వ. ఎందువలన ననఁగా నామూర్ఖున కెంతచెప్పినను దెలియంజాలఁడు.

శ్లో॥ నిరవద్యానిపద్యాని యద్యనాథస్యకాక్షతిః ।
భిక్షుణాకక్షనిక్షిప్తః కిమిక్షుర్నీరసోభవేత్ ॥

తా. ప్రాసవిశ్రమాదిభంగాది దోషంబులు లేక శృంగారాది రసంబులతోఁగూడిన పద్యంబులం జెప్పుటకుఁ దగుసామర్థ్యంబుగలిగి నిరాశ్రయుఁడై యున్న కవివరునకు దారిద్ర్యముండిననేమి? అందువలన పద్యంబులయందలి రసము చెడిపోవునా? యెట్లనిన భిక్షుకుని కక్షభాగమందున్న చెఱకుగడ మాధుర్యము లేనిదగునా?

వ. ఓ జనులారా! వినుండు.

శ్లో॥ అస్థిరంజీవనంలోకే అస్థిరంయౌవనంధనమ్ ।
అస్థిరందారపుత్రాదిధర్మకీర్తిద్వయం స్థిరమ్ ॥

తా. ఆయుర్దాయమా? ఆకుకొనయందుఁ కఱచుకొనియున్న యుదకబిందువుతో సమానము. యౌవనమా? ఝరీవేగతుల్యము. ధనము చపలస్వభావముగలది. దారాపుత్రాదులు సత్యముగా నమ్మఁదగినవారుకారు. కనుక సంసారము స్వప్నవిచారము. ధర్మము కీర్తియును స్థిరములు.

వ. ఇట్టి వివేకముఁ బొందఁజాలని మూఢులు "లేదు. మా వల్లకాదు" అనుమాటలు నిందకుఁ గారణములు వినుఁడు. తొల్లి సూర్యవంశమందుఁబుట్టిన యంబరీషుని కడకు దూర్వాసమహాముని సనుదెంచిన నారాజన్యుం డతి

భక్తిపూర్వకంబుగ నతిథిసత్కారంబు లొనర్చి యుచితాసనంబునం గూర్చుండఁబెట్టి దండప్రణామంబు లాచరించి క్షేమంబరసి ప్రసన్నుఁడైన మునివరుంజూచి భూవరుండు ధర్మంబులువిన నభిలాషగలిగి ముకుళితకరకమలుండై యిట్లనియె.

శ్లో॥ సుపాత్రే తీర్థయాత్రాయాం వివాహే యజ్ఞకర్మణి।
వాపీకూపతటాకేషు ధనంగచ్ఛతి ధర్మిణామ్॥

తా. లోకంబున ధర్మవంతులగువారి ధనము విద్యాజాతితపోవృత్తిసంపన్నులగు సత్పాత్రులయందును దీర్ఘయాత్ర వాపీకూపతటాకవివాహాద్యజ్ఞకర్మంబులయందునుఁ జెందుచున్నది.

శ్లో॥ నిలయేభూషణేష్వేవ వివాదేషు పునఃపునః।
నృపాగ్నితస్కరాణాంవా ధనంగచ్ఛత్యధర్మిణామ్॥

తా. ధర్మబాహ్యులగువారియొక్కధన మున్నత గృహనిర్మాణమందును, నానావిధాభరణరచనలయందును, మాటిమాటికి వ్యాజ్యములయందును (అపరాధనిమిత్తమై) రాజులకును, యగ్నిదేవునకుఁగాని చోరులకుఁగాని చెందుచున్నది.

వ. వీరు వ్యర్థప్రయోజనులుగదా.

శ్లో॥ రాజాబలందుర్బలానాం ద్విజాతీనాంశ్రుతంబలమ్।
పత్నీబలంగృహస్థానాం బలంజ్ఞానంమహాత్మనామ్।
అన్నంబలంమనుష్యాణాం ధర్మంవై సంపదాంబలమ్॥

తా. బలహీనులకు రాజును, బ్రాహ్మణులకు వేదమును, గృహస్థులకు గృహిణియును, మహాత్ములకు జ్ఞానమును, మనుష్యులకు నాహారమును, సంపదకు ధర్మమును, బలముగనున్నది.

వ. అను నార్యోక్తప్రకారముగా ఓస్వామీ! పూర్వపుణ్య (వ్యయ) ముచేఁ బొందఁబడిన పుత్రకళత్రకనకాదిసంపదలకుఁ బాత్రపాణి కమలార్పణమే బలముకదా. దీనానాథజనులకును, సత్పాత్రములకును, స్వకీయసంపదల నుపయోగపఱచుటతప్పఁ దదన్యకార్యములచే సంపదలకు బలహీనము. కావున.

క. ఏదాన మిలను శ్రేష్ఠము
మోదంబెదఁబొదలఁ దెలుపుమునిపుంగవ నా
ఖేదముఁ దీఱఁగ దానిని
సాదరమున నాచరింతు సద్గుణసాంద్రా.

వ. అని యీప్రకారంబుఁగా వినయవినమిత శిరస్తలన్యస్త హస్తకమలుండై ప్రార్థించుచున్న యంబరీషుం గాంచి దూర్వాస మునీంద్రుండు చిఱునవ్వునవ్వి ప్రియంబున నతని కిట్లనియె.

శ్లో॥ మేరౌమందరకందరాసుహిమవత్సానౌమహేంద్రాచలే
కైలాసస్యశిలాతలేషు మలయప్రాగ్భారిపూ రేష్వపి।

సహ్యాద్రావపి తేషు తేషుబహుళో రాజన్ శ్రుతం తేమయా।
లోకాలోకవిచారచారణగణై రుద్గీయమానంయశః ॥

తా. ఓ రాజేంద్రా! మేరుపర్వతమందును, మందరాద్రి గుహాలయందును, హిమవత్పర్వత చరులయందును, మహేంద్రాచలమందును, కైలాసగిరి శిలాప్రదేశములందును మఱియు నానాప్రదేశములయందు లోకాలోకపర్యంతసంచారులైన చారణగణంబుచే విశేషించి గానముచేయంబడుచున్న నీయొక్క కీర్తి నేనువింటిని.

వ. సజ్జనుఁడు సత్కీర్తియె శాశ్వతంబని యెఱుఁగవలయు. ఎట్లన.

శ్లో॥ దేహేపాతినికారతత్పా యశోరక్ష్యమపాతియత్ ।
నరఃపతితకాయోపి యశఃకాయేనజీవతి ॥

తా. దేహముపతనశీలమై యగ్నిచేదహింపఁబడుచున్నది. లేక సృగాల శునకంబులచే భక్షింపఁబడుచున్నది. ఇట్టిదేహము లేశమాత్రమైనను రక్షింపఁదగినది కాదైనను “శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్” అనురీతిఁగా శరీరమనిత్యమైనను ధర్మసాధనము గనుక నిట్టిశరీరముచేతనే నాశరహితమైయుండునట్టిసత్కీర్తి సంపాదింపఁదగినది. దేహమునశించినను కీర్తిచెడదు. సత్పురుషుఁడు గీర్తి యనుశరీరముతోఁ జిరకాలంబుండును. కానసత్కీర్తినే సంపాదింపవలయును.

వ. మఱియును.

శ్లో॥ నిమేషమాత్రమపి తే వయోగచ్ఛన్నతిష్ఠతి ।
తస్మాద్దేహష్వనిత్యేషు కీర్తిమేకాముపార్జయేత్ ॥

తా. అస్థిరంబులగు దేహంబులందు జీవితముపోవునదిగాని క్షణమాత్రమైన నుండదు. తానేయవస్థయందున్ననుఁ బ్రతిక్షణము వయస్సు తఱిగిపోవుచునేయున్నది. "శ్లో॥ నందంత్యుదితఆదిత్యే। నందంత్యస్తమితేరవౌ॥" సూర్యుండుదయాస్తమయములచేఁదమ యొక్క యాయుర్దాయమును హరించుటనుఁ దెలియఁజాలక మానవులు సూర్యుని యుదయాస్తమయములందు హర్షింపుచున్నారెట్లనఁ బగటియందు ధనార్జనముకొఱకున్నూ, కుటుంబమునుభరించుట కొఱకున్నూ, రాత్రియందు స్త్రీసంభోగాదులకున్నూ, నిద్రకున్నూ సమయముగదా యని యాయుష్యము నశించిపోవు టెఱుంగక సంతోషించుట మూఢులగువారికి స్వభావమేగదా. అది తెలిసి సజ్జనుఁడగువాఁ డిహపరసుఖసాధనమగు సత్కీర్తిని సంపాదింపవలయును.

శ్లో॥ జీవితం తదపిజీవితమధ్యే ।
గణ్యతేసుకృతిభిః కిముపుంసాం ।
జ్ఞానవిక్రమకళాకులలజ్జా ।
త్యాగభోగరహితం విఫలంయత్ ॥

తా. పురుషులయొక్క జీవితకాలమధ్యమందు జ్ఞానమును, విద్యయు, పరాక్రమకులంబులును, లజ్జయు, త్యాగంబును, భోగంబును, ననువీనితోఁగూడిన జీవిత మేదిగలదో యట్టిబ్రతుకే పుణ్యపురుషులచే గణింపఁబడుచున్నది గాని జ్ఞానవిక్రమకళాత్యాగభోగాదులచే శూన్యమగుజీవితము ప్రశంసింపబడుచున్నదా? ప్రశంసింపంబడదు.

వ. రాజేంద్రా! అట్టిబ్రతుకు నిష్ఫలముగావున నీవుసత్కీర్తిని సంపాదించి సకలసుజనులచేఁ గొనియాడఁబడుచున్న జీవితము గలవాఁడవైతివి.

శ్లో॥ వాచ్యం శ్రద్ధాసమేతస్య పృచ్ఛతశ్చ విశేషతః ।
ప్రోక్తం శ్రద్ధావిహీనస్య అరణ్యరుదితోపమమ్ ॥

తా. శ్రద్ధాయుక్తుండై యడిగినవానికి సుజ్ఞానము విశేషించి చెప్పఁదగును. శ్రద్ధలేనివానికిఁ జెప్పుట యరణ్యరోదనముతో సమానము.

వ. అనునార్యోక్తి ననుసరించి శ్రద్ధాళుఁడవై నన్నడిగిన ప్రశ్నకు సదుత్తరంబొసంగెద వినుము. భూవరా? లోకంబున ననేకదానంబులుగలవు. వానిలో షోడశమహాదానంబు లుత్తమంబులు. ఆదానంబులలో నుత్తమోత్తమంబగుదానం బొకటిగలదు. సావధానచిత్తుండవై యాకర్ణింపుము.

శ్లో॥ కాంచనాదీనిదానాని గృహ్ణంతో గృహమేధినః ।
ఉపర్యుపరివాంఛంతి చాతకాళిర్జలంయథా ॥

తా. గృహస్థులు హిరణ్యాద్యనేకదానంబులగ్రహించుచుఁ దృప్తినొందక చాతకపక్షులు మేఘోదకమునుఁ గోరునట్లు పైపైఁగాఁ గోరుచున్నారు.

శ్లో॥ కృతేయుగే తపశ్శైవ త్రేతాయాం యజ్ఞకర్మ చ।
మహామనుర్ద్వాపరేతు కలౌదానం విశిష్యతే ॥

తా. కృతయుగమందు తపోయజ్ఞమంత్రానుష్ఠానదానంబులును, త్రేతాయుగంబున యజ్ఞమంత్రానుష్ఠానదానంబులును, ద్వాపరయుగంబున మహామంత్రానుష్ఠానదానంబులును, కలియుగంబున దానము మాత్రము చెప్పంబడియున్నది.

వ. ఈదానమాత్రంబుచేఁ జతుర్వర్గఫలమునుఁ బొందెదరని చెప్పుదురు. మఱియుఁ జతుర్యుగములం దవశ్యముగా నాచరింపఁదగిన దానమనెడి తపస్సును సృష్ట్యాదియందు భూలోకమందలి సకలజనంబులకొఱకుఁ జతుర్వర్గసాధనమని బ్రహ్మచే నియమింపంబడుటఁజేసి నాటనుండి దానంబు భూలోకంబునఁ బ్రశస్తంబై సమస్తసజ్జనులచే ముఖ్యముఁగా నాచరింపఁబడుచున్నది. బ్రహ్మచే నియమింపఁబడినదగుట దానము సర్వయుగంబుల సకలజనులకు ముఖ్యకర్తవ్యంబై యుండు ననిన మునిచంద్రుం జూచి రాజచంద్రుం డిట్లనియె. ఓఋషివరా! భూలోకవాసులగు మానవులకు దానం బావశ్యకమని బ్రహ్మదేవునిచే నెందునిమిత్తమై నియమింపఁబడెను. తద్వృత్తాంతంబంతయుం దయాళుండవై శ్రవణకుతూహలచిత్తుండనైన నాకు సాదరంబుగఁ దెలియంజెప్పుమని ప్రార్థింపుచున్న యంబరీషుంగాంచి దూర్వాసుం డిట్లనియె.

శ్లో॥ సురాసురమనుష్యాణాం బ్రహ్మణోక్తం పురానఘ।
ఆఖ్యానం తే ప్రవక్ష్యామి ధర్మజ్ఞ శ్రుణుతత్త్వతః ॥

తా. ఓ రాజశేఖరా ! యీ దానప్రశంసయందు వేదచోదితంబై బ్రహ్మచేఁ జెప్పంబడిన పురాతనంబగు నాఖ్యానం బొకటి గలదు వినుము.

వ. తొల్లి దేవాసురమనుష్యగణంబులు వేదోక్తంబులగు తపోయజ్ఞంబులు కాయిక, వాచిక, మానసికాద్యనేక సత్కర్మంబులు చిరకాలం బాచరించి యాసత్కర్మంబులచే సులభంబుగఁ జతుర్వర్గఫలంబు నొందనశక్తులై పరస్పరంబుగా బహుప్రకారంబులు విచారించి యెద్దియుం దోచక సురాదిగణంబులు సకలజగత్స్రష్టయగు పితామహు నొద్దకుం బోయి యచట బాలార్కప్రభాభాసమానంబగు సభామంటపంబున మూర్తిమంతంబులగు ఛందోగణంబులు బరివేష్టింప సర్వార్థగోచరజ్ఞానంబున సరస్వతీసమన్వితుండై యున్న బ్రహ్మదేవునింజూచి సంతోషంబున భక్తియుక్తులగుచు నిటలతటఘటితాంజలులై యిట్లని నుతించిరి.

శ్లో॥ అనంతాఽవ్యక్తరూపేణ ఏనేదమఖిలంతతత్ ।
చిదచిచ్ఛక్తియుక్తాయ తస్మై భగవతేనమః ॥

తా. ఏమహాత్మునిచేఁ ద్రివిధపరిచ్ఛేద శూన్యంబై యింద్రియాతీతంబగు స్వరూపమ్ముతో నీయఖిలప్రపంచంబునకు నంతరాత్మయగుటచేఁ బ్రకాశింపుచున్నదో యట్టిచిదచిచ్ఛక్తియుక్తుండును షడ్గుణైశ్వర్యసంపన్నుండునునగు నీకొఱకు నమస్కరించెదము.

వ. అనిపరమాత్మస్వరూపుండను భావంబున నద్దేవు స్తుతించి యనేకదండప్రణామంబులుచేసి విన్నపంబుసేసి రెట్లనిన. దేవా! యజ్ఞానులమైన మావంటివారికిఁ బురుషార్థప్రదంబును. జ్ఞానంబునిచ్చునదియైన సద్ధర్మంబెద్దియో యదిమాకందఱకుఁ జెప్పుండనినసర్వభూతదయాళుండగు వాణీనాథుం డాపన్నులైన దేవాసురమనుష్యగణంబులంజూచి సాదరంబుగ నిట్లనియె.

శ్లో॥ దేవాసురమనుష్యాణాం జ్ఞాత్వోదంతంమహామతిః ।
ఏకేనదేత్యక్షరేణ ప్రత్యువాచత్రికాలవిత్ ॥

తా. అంత వాణీనాథుఁడగు బ్రహ్మ త్రికాలజ్ఞుఁ డగుటం జేసి బృందారకాదిగణంబుల యభిప్రాయంబెఱింగి వారివారి కానుకూల్యంబైన పరమశ్రేయోధర్మంబు సంగ్రహించి సురాసురమర్త్యగణంబులకుఁ దవర్గమధ్యమంబై "శ్లో॥ దకారరూపిణే మేధా। దక్షిణామూర్తయేనమః" అని పరమశివస్వరూపంబగు "ద" అనెడి యేకాక్షరంబుతో దేవతాదులకుఁ బ్రత్యుత్తరం బొసంగి సెలవొసంగె.

వ. అనంతర మాసురాదులు సభామంటపంబు వెడలి యొ

క ప్రదేశంబునంజేరి మహాత్ముండగు వాణీపతి మనకం దఱికిని "ద" యను నేకాక్షరం బుపదేశించి బంపె. ఇందువలన మన కెవ్విధంబయిన యభిప్రాయ ముపదేశించెనోయని దమలో బుద్ధిమంతులగు వారితో నాలోచించి దేవతలు మనమింద్రియలోలులమై యీశ్వరానుగ్రహంబుచేఁ బొందఁబడిన స్రక్చందన దివ్యాంబర దివ్యభూషణ దివ్యవనితా సుఖంబు లనుభవింపుచు మత్తులమైయుండెడి మనకు " బాలానాంతాడనంపత్ర అనున ట్లింద్రియనిగ్రహరూపంబై పత్థ్యంబగు దమదపంబాచరింపుఁడనియును, రాక్షసులు దమలో శ్రేష్ఠులగువారలతో విచారించి చతుర్ముఖుండు "ద" అను నేకాక్షరంబునుడివె. ఇందునలన మనమందఱము కౄపాశూన్యులమై హింసావిహారుల మగుటంజేసి భూతములయెడ "దయాంకురుధ్వమ్" దయాతపం బాచరింపుఁడని యాజ్ఞాపించెననియును, మానవులునుఁ దమలో నుత్తములైనవారితో విచారించి మనకెల్లఱకును "ద" యనెడి యేకాక్షరముసూచించె నిందువలన నీషణత్రయంబులలోఁ బత్నీసంబంధమైన దారేషణంబును, బశుసంబంధమైన పుత్రేషణంబును నంత కెక్కుడైన ధనేషణంబుచే గురుబ్రాహ్మణ బంధువులకైననుఁ దృణంబివ్వక నయాచితులమైనను నన్నోదకంబు లిడక లోభలోలు

రమైయున్న మనకు "దానంకురుధ్వమ్" దానతపంబు చే ధన్యులగుదురని యాజ్ఞాపించెననియును నిశ్చయించిరి. అట్లు సర్వజగద్గురువగు బ్రహ్మదేవుని యభిప్రాయంబైన దమ, దయా, దానంబులను నద్దేవుని యనుగ్రహంబున "ద" యనెడి యేకాక్షరవ్యాఖ్యానంబుచే నెఱింగి.

శ్లో॥ తతస్సురాదయస్సర్వే బ్రహ్మణాచ్ఛిన్నసంశయాః।
స్వాన్స్వాన్లోకాన్సమాజగ్ము రత్యంతంహృష్టమానసాః॥

తా. అంతట సురాదిగణంబులు చతురాననుచాతుర్యంబుం గొనియాడుచు సంతుష్టహృదయులై వారివారి లోకంబులకుం బోయిరి.

వ. ఇమ్మెట దేవతలు విషయవిముఖులగుచు దమతపఃప్రవర్తకులై రాక్షసులు హింససేయక దయాతపోవర్తనులగుచు మానవులు లోభంబువిడిచి దానతపఃపరులై ధర్మార్థకామమోక్షఫలంబులొంది సుఖింపుచుండిరని దూర్వాసయోగీంద్రుండు చెప్పిన విని యంబరీషుండు సంతోషహృదయుండయ్యె. అనంతరంబ.

శ్లో॥ తత్రాపిభారతేవర్షే కర్మభూమౌసుదుర్లభే।
నాన్నోదకసమందానం నద్వాదశ్యాఃపరంవ్రతమ్॥

తా. కర్మభూమియగు నీభూలోకంబున భారతవర్షమందున్న భరతఖండమం దన్నోదకములతో సమానమగు దానంబును, ద్వాదశీవ్రతముకంటె శ్రేష్ఠమగు వ్రతమును లేదు.

శ్లో॥ శృణురాజన్ ప్రవక్ష్యామి సర్వపాపప్రణాశనమ్।
దానానామపి సర్వేషాం యద్దానం సుమహాత్ఫలమ్॥
అన్నదానాత్పరం దానం నాస్తికించిజ్జగత్త్రయే।
అన్నేన లోకా జాయంతే హ్యన్నే ప్రాణాః ప్రతిష్ఠితాః॥
అద్యతే త్తిచ భూతాని తస్మాదన్నం తదుచ్యతే।
దుర్భిక్షే వా సుభిక్షే వా నిశి వా దివ మేవ వా॥
ద్విజశూద్రాంత్యవర్ణానాం ప్రహృష్టోన్నం దదాతి యః।
సురలోకేపి గంధర్వాః కీర్తయంతి హితం నరమ్॥

తా. రాజశేఖరా! వినుము. విన్నమాత్రమున సకలపాపములు నశించునో దానములలో నేదాన మధికఫలంబిచ్చునో యట్టి యన్నదానముకంటె శ్రేష్ఠమగుదానము మూడులోకంబులందును లేదు. మఱియు సమస్తప్రాణులన్నమువలనఁ బుట్టుచున్నారు, అన్నముచేతనే వృద్ధినొందుచున్నారు. దేహధారులయొక్క ప్రాణము లన్నమందే నిలిచియున్నవి. సమస్తభూతము లన్నముఁదిని జీవించుటవలన వానికాధార మన్నమని వేదపురుషునిచేఁ గీర్తింపఁబడుట నన్నము నేపురుషుఁడే నియుఁ దృప్తిఁబొందిన మనస్సుగలవాఁడై బ్రాహ్మణులకుఁగాని, శూద్రులకుఁగాని చండాలురకుఁగాని దుర్భిక్షసుభిక్షకాలములయందును రాత్రిగాని పగలుగాని శక్తికొలఁది నన్నదానముఁ జేయుచున్నాఁడో యట్టిపురుషుని దేవలోకంబునందు గంధర్వులు కీర్తించుచున్నారు. కనుక నన్నదానము దానములలో శ్రేష్ఠత్వమువహించి దానరాజమని చెప్పఁబడును.

శ్లో॥ దానానాముత్తమం దానం అన్నదానం తథాజలమ్।
తజ్జలం యే ప్రయచ్ఛంతి ప్రాణదాః పరికీర్తితాః॥

తా. అన్నదాన మెట్లుత్తమమైనదో యుదకదానము నట్లే యుత్తమమైనది. ప్రాణమును రక్షించునట్టి యుదక మెవరు దానము సేయుచున్నారో వారు ప్రాణదాతలని చెప్పఁబడుచున్నారు.

వ. ఓ యంబరీషుఁడా! మఱియొకవిశేషంబు సెప్పెద వినుము. పరబ్రహ్మస్వరూపము సకలభూతములయందుఁ బ్రవేశించి భూతములనుఁ బ్రకాశింపజేయుటచే భూతావాసుండు వాసుదేవుఁడని తత్వజ్ఞులచేఁ జెప్పంబడుచున్నాఁడు. అటువలెనే యన్నమ్మును సకలశరీరములందుఁ బ్రవేశించి దేహధారులనుఁ బ్రకాశింపఁజేయుచున్నది గాన నన్నమునకును పరబ్రహ్మమునకును భేదములేకుండుట వలన వేదపురుషుఁడు వేదములం దన్నమే పరబ్రహ్మమని చెప్పియున్నాఁడు. అన్నదానమువలన భూతతృప్తియగుచున్నది. భూతతృప్తిరూపకముగా భూతావాసుండైన వాసుదేవుండు మిక్కిలి తృప్తింబొంది యానందించి జన్మమరణాదులులేని పరమపదంబు (మోక్షము) నిచ్చుచున్నాఁడు. మిగిలిన ధర్మార్థకామము లతనికి సులభములు గదా. అన్నదాతకును వాసుదేవునకును భేదమేమియును లేదు.

శ్లో॥ అత్రైవ్రోదాహరంతీమ మితిహాసం పురాతనమ్।
వేదేభ్యశ్చ్యాప్రియతే రాజన్ ఆయురారోగ్యవర్ధనమ్॥

తా. ఓరాజా? అన్నదానమహిమాను వర్ణనంబై యాయు రారోగ్యసంపదలనిచ్చు పురాతనంబగు నొకచరిత్రంబు వేదంబు లందును వినంబడుచుండును దాని నీకుంజెప్పెద వినుము.

శ్లో॥ పురాఖలుమహాబాహో। భూసురోవేదవిత్తమః।
అభవత్సుజనోనామా। సర్వభూతహితేరతః॥

తా. పూర్వకాలమందు వేదవేత్తలలో శ్రేష్ఠుండై సర్వ భూతములందు దయగల సుజనుఁడను పేరుగలిగిన బ్రాహ్మణుఁడు గలఁడు.

వ. అతఁడు గృహస్థధర్మంబుననుండి మోక్షముబొందుట దుర్లభంబని హృదయంబునఁ జక్కఁగా నాలోచించి.

శ్లో॥ న వైరాగ్యాత్పరం భాగ్యం। నబోధా దపరస్సఖా।
న హరేరపరస్త్రాతా। న సంసారాత్పరోరిపుః॥

తా. వైరాగ్యముకన్న శ్రేష్ఠమగు భాగ్యమును, జ్ఞానము కన్న నితరమైనస్నేహితుఁడును, శ్రీహరికన్న రక్షకుఁడును, సంసారముకంటె నెక్కుడైన శత్రువును లోకంబునలేదు.

శ్లో॥ దేహాపత్య కళత్రాది। హ్యాత్మనైన్యేష్వ సత్స్వపి।
తేషాం ప్రమత్తోనిధనం। పశ్యన్నపినపశ్యతి॥

తా. తనసంబంధమైన దేహమును, దారాపుత్రాదులును, గృహంబులును, పశువులును, ధనమును, బంధువులును నిత్య

ములుఁ గాఁకుండుటఁ దానుజూచుచు మిక్కిలి మత్తుఁడై యెఱుఁ గఁజాలకున్నాఁడు.

వ. కావున.

శ్లో॥ పునరపిజననం పునరపి మరణమ్ ।
పునరపి జననీ జఠరే శయనే ।
ఇహ సంసారే బహుదుస్తారే ।
కృపయాపారే పాహిమురారే ॥

తా. పుట్టుచుఁ జచ్చుచు వెండియు మాతృగర్భప్రవేశము నొందుచుఁ దరిగానక మిక్కిలితరింప శక్యముగానిసంసారమందుఁ దపింపుచున్న నన్ను మురాసురసంహారివైన యోశ్రీకృష్ణుఁడా? దయతోడ రక్షింపుమా;

వ. అని సర్వసంగపరిత్యాగియై యోగాభ్యాసంబుఁ జేయం గోరి సుజనుండు దనకుఁదగిన గురువునపేక్షించి దూరదే శంబుఁ జనుచుండ నొకదుర్గమారణ్య మార్గంబునందు జలంబు లింకినమడువులోన సూర్యకిరణంబుల వేడిమిచే బాధనొందుచు బురదలోఁ బొరలుచుండెడి కూర్మంబొ కటి యాబ్రాహ్మణుంజూచి చేరంబిలిచి మనుష్యవాక్యం బుల నతని కిట్లని చెప్పందొడంగె.

శ్లో॥ కశ్చి ద్విజవరశ్రేష్ఠ ధర్మస్తే వృద్ధసమ్మతః ।
వర్తసే నాతికృచ్ఛ్రేణ సంతుష్టమనసా సదా ॥

సంతుష్టో యదివ ర్తేత బ్రాహ్మణో యేన కేనచిత్ ।
అహీయమానస్సా స్యద్ధర్మా త్సహస్యాఖిలకామధుక్ ॥

తా. ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా? యెప్పుడును సంతోషచిత్తుఁడవై దుఃఖము లేకయున్న నీధర్మము పెద్దలచే సమ్మతింపఁబడుచున్నది. బ్రాహ్మణుఁడే కార్యముచేతనేనియు సంతుష్టిగలవాఁడై యుండెనేని సర్వోత్కృష్టమగు "యదృచ్ఛాలాభసంతుష్టి" యనెడు ధర్మమా బ్రాహ్మణునకు సమస్తమైనకోరికెల నిచ్చునట్టి దగుచున్నది. మఱియట్టియదృచ్ఛాలాభ సంతుష్టిగల బ్రాహ్మణుఁడు దనచే నాచరింపఁబడుచున్న సద్ధర్మమహిమచే నీప్రపంచమునకుఁ దానుసమస్తకోరికెలనుఁ బిలుకునట్టివాఁడగుచున్నాఁడు.

శ్లో ॥ అసంతుష్టోసకృల్లోకా న్నాప్నోత్యపి సురేశ్వరః ।
అకించనోపి సంతుష్ట శ్శేతేసర్వాంగ విజ్వరః ॥

తా. సంతుష్టిలేని బ్రాహ్మణుఁడు స్వర్గాదిలోకములం దిరుగుచుండి దేవేంద్రపదవినొందియు నొకచోనైనను సుఖములేక దుఃఖింపుచున్నాఁడు. ఎల్లప్పుడు సంతుష్టుఁడగు బ్రాహ్మణుం డేమిలేనివాఁడైనను యేలోకమందున్నను దృఢగాత్రుఁడై దుఃఖపడక సౌఖ్యమువేఁ బొందుచున్నాఁడు.

శ్లో ॥ విప్రాన్ స్వలాభసంతుష్టా ।
న్సాధూన్ భూతసుహృత్తమాన్ ।
నిరహంకారిణ శ్శాంతా ।
న్నమస్యే శిరసా సకృత్ ॥

తా. లోకంబులయందుఁ దనంతనే బొందఁబడిన లాభముచేనైనను, లేక శరీరత్రయ విలక్షణమై సచ్చిదానందరూపమగు తనను దాను గుర్తెఱిఁగెడి లాభముచేనైనను సంతుష్టులును, స్వకీయవర్ణాశ్రమ ధర్మంబులయం దత్యంతనిష్ఠగలిగియు, సర్వభూతములయందు సుహృద్భావంబుగలిగియు "నేకర్తను" "నేభోక్త" ననెడియభిమాన శూన్యులై మానావమానద్వంద్వంబులయందు సమతనుఁ జెంది పరమశాంతులైన బ్రాహ్మణోత్తములనుఁగూర్చి మాటిమాటికిని నేనుశిరస్సుచేతనమస్కరింపుచున్నాను.

౬. ఓపుణ్యపురుషా! నినుంజూడ సత్యశౌచ భూతదయాది సద్గుణనిలయుండగు బ్రాహ్మణుండని తోఁచుచున్నది. కాన నీనిర్జలకాసారంబునఁ బరితపించెడి నన్నుజలముచేనిండిన మడువునంజేర్చి యుద్ధరింపుము.

శ్లో॥ అఘటిత ఘటితానిఘటయతి ।
ఘటితఘటితాని దుర్ఘటీకురుతే ।
విధిరేవతాని ఘటయతి ।
యానిపుమాన్నైవ చింతయతి ॥

తా. దైవము ఘటనగాని పదార్థములను ఘటనముఁ జేయుచున్నాఁడు. ఘటనమైనవానిని విఘటనముఁ జేయుచున్నాఁడు. మఱి పురుషుఁడు తలంచనివానిని ఘటింపఁజేయుచున్నాఁడు.

శ్లో॥ విధిరేవ విధానేన వరంలోకేనువర్తతే ।

తా. అనఁగా లోకమందు దైవము ఘటనాఘటనవిధానముచే దేహధారిని యనుసరించియున్నాఁడు.

వ. దైవముచే ననుసరింపఁబడనికాలము క్షణమైనను లేదు సుమా; ఇట్లు నిన్నిటకు సంఘటింపఁజేసెఁ గావున నా వాక్యంబులాలించి నన్ను రక్షించిన దీననీకు మహాఫలంబు గలుగు ననిచెప్పి మఱియు నిట్లనియె.

శ్లో॥ ఏ తేసత్పురుషాః పరార్థఘటికాస్స్వార్థాన్పరిత్యజ్యయే ।
సామాన్యాస్తుపరార్థముద్యమభృతస్స్వార్థావిరోధేనయే।
తేమీమానుషరాక్షసాఃపరహితంస్వార్థాయనిఘ్నంతియే।
యేతుఘ్నంతినిరర్థకం పరహితం తే కేనజానీమహే॥

తా. ఉత్తములగువారు తమకార్యములను విడిచిపెట్టి యితరుల కార్యములను నెరవేర్తురు. మధ్యములు తమకార్యములకు హానిలేకుండఁ బరకార్యములనుఁగూర్చి ప్రయత్నపడుచుందురు. మనుష్యులలో రాక్షసులవలె క్రూరులగు యధములు స్వకార్యములకొఱకై పరులయొక్క సుఖమును నశింపఁజేయుచున్నారు గాన వారు మనుష్యరాక్షసులని చెప్పఁబడుదురు. అధమాధములు దమకుఁ గార్యములేకపోయినను పరుల సౌఖ్యమునకు భంగముఁ గలిగించుచున్నారు. అట్టివారెటువంటి కర్మముగలవారో గుర్తెఱుఁగము.

సీ. పరులకొఱకుతరులు ఫలములనిచ్చును
బరులకొఱకునదులు పాఱుచుండుఁ

బరులకొఱకు మేఘపఙ్తులు వర్షించుఁ
బరులహితముకంటెఁ బరముగలదె.

వ. అని వేఁడుచున్న కూర్మంబునుఁగాంచి యాశ్చర్యమంది యాబ్రాహ్మణుండిట్లనియె. ఓకమఠమా? నీవు జలమందు సంచరించుదానవై యుండియు నన్యజాతి సామాన్యంబులగు మానవభాషలు నీకెట్లభ్యాసంబయ్యె. వినుట కిచ్ఛయింపుచున్న నాకు వినుపింపుమనిన నాతాఁబేలతని కిట్లనియె. అయ్యా? నేను జలములేని యీయామడువున తృష్ణ పిపాసాయాసంబుచే దేహమ్మెఱుంగకఁ బడియుంటి. నా భాగ్యదేవతప్రాయున నేతెంచిన నినుంజూచి కొంతసం భాషించితిని. ఇఁక విశేషము భాషింపఁజాల. నన్నతి శీఘ్రంబుఁగ జలపూర్ణంబైన సరోవరంబునం జేర్చినఁ దృప్తిఁగా జలంబులఁద్రావి నావృత్తాంతమంతయు వివ రించెద. అది నీకత్యావశ్యకంబై యుండుననిన నాభూ దేవుండు దనమనంబునఁ గొంతవడియాలోచించి యిది యాశ్చర్యముఁగా నున్నది. దీనినాద్యంతం బీక్షించెదఁ గాక యని యాతాఁబేలునెత్తికొనిపోయి సమీపమం దున్న యొకజలపూర్ణసరోవరంబున విడిపించె నంతనా తాఁబేలామడువునం దృప్తిఁగా జలపానమొనరించి యా కలియుదప్పియుఁ దీర్చికొని గట్టునకువచ్చి సంతోష హృదయంబుతోద్విజవరుండగుసుజనుంగాంచియిట్లనియె.

శ్లో॥ లక్ష్మీకౌస్తుభపారిజాతసహజస్సూనుస్సుధాంభోనిధే ।
ర్దేవేనప్రణయప్రసాదనిధినామూర్ధ్నాధృతశ్శంభునా ।
అద్యాప్యుజ్ఝతినైవదైవవిహితంక్షైణ్యంక్షపావల్లభః ।
కేనాన్యేనవిలంఘ్యతేవిధిగతిఃపాషాణలేఖాసఖీ॥

తా. అక్ష్మీకౌస్తుభపారిజాతవృక్షంబులకుఁ దోఁబుట్టువును, క్షీరసముద్రమునకుఁ బుత్రుఁడును నగుచంద్రుఁడు నిర్మలానుగ్రహమునకు నిక్షేపమును, స్వప్రకాశుఁడును సుఖస్వరూపుఁడును నైన శంకరునిచే శిరంబున ధరింపఁబడియుండియు దైవంబుచే విధింపఁబడిన క్షీణత్వము నిప్పటికిని విడిచిపెట్టఁజాలకున్నాఁడు. దైవయోగము ఱాతిమీఁదివ్రాలుగావునఁ జంద్రునికంటె నితరమైనవారెవ్వరిచేతనైన నతిక్రమింపఁబడుచున్నదా.

శ్లో॥ యస్మాచ్చయేనచయదాచయథాచయచ్చ ।
యావచ్చయత్రచశుభాశుభమాత్మకర్మ ।
తస్మాచ్చతేనచతదాచతథాచతచ్చ ।
తావచ్చతత్రచఫలంలభతేమనుష్యః॥

తా. లోకమందు మనుష్యుఁడు పూర్వమందుఁ జేయఁబడినపుణ్యపాపరూపమైనతనయొక్కకర్మనుఁ దానేయనుభవింపుచున్నాఁడు. అది యెట్లనిన నేకారణమువలన నేకర్మ చేయఁబడినదో యాకారణమువలన నాకర్మఫలమునుఁ బొందుచు నేయింద్రియముచే నేకర్మ చేయఁబడినదో యాయింద్రియముచే నాకర్మఫలము నేకాలమందే కర్మ చేయఁబడినదో యాకాలమందాయవస్థయం దాకర్మఫలమునుఁ బొందును. ఏప్రకారముఁగా నే కర్మ చేయఁ

బడినదో యాప్రకారముఁగా నాకర్మఫలమునంతపర్యంత మేకర్మ
చేయఁబడినదో యంతపర్యంత మాకర్మఫలమును నేప్రదేశమం
దేకర్మ చేయఁబడినదో యాప్రదేశమం దాకర్మఫలమునుఁ బొందు
చున్నాఁడు.

5. సంశయములేదీనీతిప్రకారముఁగాఁ బూర్వజన్మంబున నే
నొనర్చినపాతకంబువలన నిట్టిదురవస్థ సంప్రాప్తమయ్యె.
వివరించెద వినుము. లోకంబున మనుష్యునకుఁ గర్మాచర
ణకాలము స్వల్పంబును గర్మఫలానుభవకాలం బతిదీ
ర్ఘంబును గావున స్వామీ? తొలిజన్మంబున నేను సునం
దుఁడను బ్రాహ్మణునికొమారుఁడను.గృహస్థాశ్రమనియం
బుననుండి యొకనాఁడు మధ్యాహ్నసమయంబున సం
ధ్యాద్యనుష్ఠానంబులం దీర్చికొని భోజనంబుసేయ నుద్య
మించి యాపోశనంబు సేయుసమయంబున నొకపంచమ
జాతీయుండు నాగృహంబునకు సమీపంబున నిలిచి దీన
స్వరంబున నోస్వామీ, యాఁకలిచేతఁ బ్రాణంబులు బరి
తపింపుచున్నవి. కొంచెమన్నముఁగాని యుదకంబుఁగాని
యిప్పించి నన్నురక్షింపుఁడని యఱచుచుండ వానివృత్తాం
తంబు విచారింపక ధర్మశూన్యుండనై.

శ్లో॥ అతిథి స్తిష్ఠతిద్వారి హ్యాపోగృహ్ణాతియోనరః ।
ఆపోశనంసురాపాన మన్నంగోమాంసభక్షణమ్ ॥

వ. అనునార్యోక్తినెఱింగియు నేమియుంబలుకక భుజింపు చుండ నాభార్యముంగిటికేతెంచి చండాలుంజూచి మృదు వాక్యంబుల నోరీపంచమ్ముఁడ; మేము బ్రాహ్మణులము నీవు చండాలుండవు. జలాన్నంబు లిడుట కెట్లుచితంబగు నెందేని యొక శూద్రునింటికేగుము. ఆకలివలన నెంత శ్రమనొందుచున్నావో "ధనక్షయే దీప్యతిజాఠరాగ్నిః" యనునట్లుఁగా దారిద్ర్యమువలన నాకలి యెక్కువయ్యె డిఁగాఁబోలునని యాగృహిణి పశ్చాత్తాపపడుచుండ నా పంచముం డాకలిచేతదుఃఖంపుచు నచ్చటనే బ్రాణంబు లు విడిచె. అంతఁగొంతకాలంబున కేను శరీరంబువిడిచి.

శ్లో॥ అపూజితోతిథిర్యస్య గృహాద్యాతి వినిశ్వసన్ ।
గచ్ఛంతివిముఖా స్తస్య పితృభిస్సహ దేవతాః ॥

తా. లోకమందతిథి గౌరవింపఁబడనివాఁడై యెవనిగృహ మునుండి నిట్టూర్పులువుచ్చుచుమరలిపోవుచున్నాఁడో వానిపితృ దేవతలతోఁగూడ సకలదేవతలు వానిగృహస్థునకు సుముఖులుఁ గాఁకఁ బరాఙ్ముఖులై పోవుచున్నారు.

వ. అనునీతి ననుసరించి యతిథినిఁ బూజసేయని పాపంబున యమపురంబుఁజేరి యందనేక సంవత్సరంబులు ఘోర నరకంబులనుభవించి ప్రారబ్ధవశంబున భూలోకంబున నిట్టిమందరూపంబైన జన్మంబునొంది శోకింపుచు.

శ్లో॥ ప్రారబ్ధంభోగతోనశ్యే త్తత్వజ్ఞానేనసంచితం
ఆగామిద్వివిధంకర్మ స్తుతినిందాకరోహరేత్ ॥

వ. అనునట్లుఁ బ్రారబ్ధకర్మంబనుభవింపుచుఁ దరిగానకదుఃఖ సాగరంబీదుచుఁ జేయంబడిన కర్మంబుఁ దలపోయుచుఁ బూర్వజన్మంబున నతిథులకన్నోదకం బిడని దోషంబుచే నుదకంబులు లేని మడువునఁ జిరకాలంబుండి క్షుత్పిపాసలచేఁ బరితపింపుచు నొకసుకృతవిశేషంబునఁ జేసి జాతిస్మరత్వంబు గలిగియున్న నన్నుద్ధరించితివి. ఓదీన బంధో? మఱియు నాసమయంబునఁ బంచము నుపశమనవాక్యంబుల నూరడించిన నాభార్య కర్మవశంబున నుత్తమవిద్యాపౌరుష సంపన్నుండగు బ్రాహ్మణుండై జన్మించె. ఆబ్రాహ్మణుండవే నీవు.

శ్లో॥ అయిఖలువిషమః పురాకృతానాం ।
భవతిహిజంతుషు కర్మణాంవిపాకః ॥

తా. ఓభూసురోత్తమా ? ఆత్మసౌఖ్యముకొఱకుఁ జేయంబడిన దుష్కర్మలయొక్క పరిపాకము (కర్మఫలము) దేహధారులయం దిప్పుడు వ్యక్తమగుచున్నది.

శ్లో॥ యద్వ్యంగాః కుష్ఠినశ్చాంధాః పంగవశ్చదరిద్రిణః ।
పూర్వోపార్జితపాపస్య ఫలమశ్నంతిదేహినః ॥

తా. ఏకారణమున నంగహీనులును, కుష్ఠరోగులును, నంధులును, కుంటివారును, బహుసంతానవంతులగు దరిద్రులగుచున్నారో యాకారణంబున దేహధారులు పూర్వజన్మమందు సంపాదింపఁబడిన పాపఫలమనుభవింపుచున్నారని పెద్దలచేఁ జెప్పఁబడుచున్నదిగదా.

వ. ఇట్లు సర్వమెఱింగినవాఁడనై యుండియు విధిప్రేరణంబున.

శ్లో॥ ననిర్మితో నైవ చదృష్టపూర్వో ।
నశ్రూయతే హేమమయః కురంగః ।
తథాపితృష్ణారఘునందనస్య ।
వినాశకాలేవిపరీతబుద్ధిః ॥

వ. అనురీతిఁ గర్మవశంబున సంప్రాప్తంబైన యతిథితిరస్క్రియారూపంబైన దోషంబుచే నిట్టి సంకటంబుల ననుభవించితి. నీవిట్లరుగుదెంచుటకుఁ గారణంబెఱిఁగింపుమనిన విస్మయచిత్తుండై యాకచ్ఛపంబునకు సుజనుం డిట్లనియె.

శ్లో॥ స్నాతంతేనసమస్తతీర్థ నిచయెద త్తంమహీమండలే ।
విప్రేభ్యోపితృదేవతా స్సురగణాస్సర్వేచ సంతర్పితాః ।
జప్త్వామంత్రసహస్రకోటి మపివాతప్తంచతీవ్రంతపో ।
యస్యబ్రహ్మవిచారణేక్షణ మపిప్రాప్నోతిధైర్యం మనః ॥

తా. నేను భూమండలమందలి సమస్తపవిత్ర తీర్థములందు స్నానముఁ జేసితిని. బ్రాహ్మణోత్తములకు దానంబు లొసంగితిని. సమస్తదేవతలును పితృదేవతలును మిక్కిలి తృప్తి నొందింపఁబడిరి. తీక్ష్ణమైన తపస్సుఁ జేసితిని. సహస్రకోటి సంఖ్యగల మంత్రములను జపించియు నాయొక్క మనంబాత్మ విచారమందు క్షణకాలమేనియు ధైర్యము నొందఁజాలకున్నది.

శ్లో॥ కామంక్రోధంలోభంమోహం।
త్యక్త్వాత్మానంపశ్యవిమోహం।
ఆత్మజ్ఞానవిహీనామూఢా।
స్తేపచ్యంతేనరకనిగూఢాః॥

తా. కామక్రోధలోభమోహంబులను బరిత్యజించి మోహశూన్యంబైన యాత్మనుఁ జూడుమా? ఆత్మజ్ఞానవిహీనులైనమూఢులు నరకంబునంబడి తపించుచున్నారు.

చ. కలితమనోరథంబులుదకంబులు తృష్ణలుభూరివీచికా
వళులనురాగముల్మకరవర్గము మోహవితర్కముల్సుడు
ల్పులుఁగులుఁగాఁగధైర్యఫలభూజముఁగూల్చుదురాశపేరిపు
ష్కలధునిదాటనిత్యసుఖసంపదఁగాంతురుయోగిపుంగవుల్.

తా. కోరికలనెడి జలంబులును, నాశలనెడి గొప్పతరంగ సమూహములును, ననురాగములనెడి మొసళ్లును, మోహవితర్కములనెడిసుళ్లును, పక్షులునుఁగాఁ గలిగి ధైర్యమనెడు ఫలవృక్షమునేఁ బడఁద్రోయునట్టిదురాశయనెడి పేరుగల యొకపూర్ణప్రవా

హాముతోఁగూడిన నదినిదాఁటఁగా యోగీశ్వరులు నిత్యానంద సంపదనుఁ బొందుచున్నారు.

వ. మఱియును.

శ్లో॥ కురు తేగంగాసాగరగమనం వ్రతపరిపాలనమథ వాదానమ్।
జ్ఞానవిహీనస్సర్వమ తేన ముక్తింనభజతిజన్మశ తేన॥

తా. గంగాదితీర్థయాత్రలును, వ్రతములును, దానములును నాచరించియు జ్ఞానము లేనివాఁడు నూఱుజన్మములకైనను ముక్తినిఁ బొందజాలఁడు.

వ. అనురీతిని నిశ్చయించి సంసారమందు విరక్తిగలిగి జ్ఞానయోగమార్గంబపేక్షించి గురువును ద్దేశించిపోవుచున్నాఁడనవిన నాజలచరంబగు కమఠంబతని కిట్లనియె. ఓస్వామీ౹ మీరపేక్షించినది మంచిదియే యగునైననుఁ దిర్యగ్జంతువని నాయెడ నశ్రద్ధచేయక నావిన్నపంబు వినుఁడు.

శ్లో॥ ప్రాప్తేజ్ఞానేనవిజ్ఞానే జ్ఞేయేచహృదిసంస్థితే।
లబ్ధశాంతిపదేదేహే నయోగోనైవధారణమ్॥

తా. శాస్త్రసిద్ధమై గురువుచే నుపదేశింపఁబడిన జ్ఞానమే విజ్ఞానము. అదియెట్టిదనిన నీశ్వరుండు నిస్సమాభ్యధికుండుగావున స్వశక్తిచే సకలప్రపంచంబులనుఁబుట్టించి యాప్రపం

చములయందుఁ దానే మాతాపితృపుత్రకళత్రోదాసీజన ద్వేష్య మిత్రపశుపాదపాది స్థావరజంగమరూప సర్వశరీరంబులు ధరించి యంతర్యామియైయుండి ప్రకాశింపఁజేయుచు లీలావిభూతితోఁ గూడికొని విహరింపుచుండుఁగాన శ్రీహరికన్న నన్యమైనదేమి యును లేదు. ఇదియునుంగాకఁ గల్పాంతమందుఁ దానొకఁడెమిగు లుచున్నాఁడు. మఱియు స్థూలచిదచిద్విశిష్టప్రపంచకారణంబైన తనయందు జగంబులు సముద్రమందలి తరంగ ఫేన బుద్బుదశీక రంబులవలె నుత్పత్తిస్థితిలయములనుఁ బొందుచున్నవి. అట్టి యద్వితీయాపరిచ్ఛిన్న సచ్చిదానంద నిర్వికారపరబ్రహ్మంబుకన్న నన్యుఁడనుఁగానని జ్ఞానముగలిగియుండుట. అట్టివిజ్ఞానము ప్రాప్తమగుచుండఁగా సర్వవేదాంతతాత్పర్యగోచరమై తెలియఁదగిన బ్రహ్మము హృదయమందు ప్రత్యక్షముఁగా భాసిల్లుచుండ జీవోపాధియగు దేహముపశాంతినొందిన నట్టి జీవన్ముక్తునికిఁ దన్నిమిత్తమైన యోగధారణాదులుపనిలేదు. నిత్యానుభూతి స్వరూపమైనఫలము సంబంధించును.

శ్లో॥ యోగరతోవాభోగరతోవాసంగరతోవాసంగవిహీనః ।
యస్మిన్బ్రహ్మణిరమతేచిత్తం నందతినందతినందత్యేవ॥

వ. కావున నెవ్వఁడేనియు గృహస్థుండై యుండియుఁ జిత్తము విజ్ఞానబ్రహ్మమందు రమింపఁజేయుచున్న యెడల నిత్యానందమునుఁ బొందుచున్నాఁడు.

శా. అన్నంబైననుఁ దక్రమైనఁదగుతోయంబైన నభ్యాగతుల్
దన్నాశించిన నేమియున్నిడక నే ధర్మంబునుంజేయకే

మన్నన్నారకనుండు జీవశవమర్త్యశ్రేణియిద్ధాత్రిలోఁ
జన్నన్నేమగునున్న నేమగునుఁ గృష్ణా దేవకీనందనా.

వ. అనురీతి నభ్యాగతులకేమియు నిడనివాఁడు శవప్రాయుం
డని జెప్పఁబడియున్నదిగాన దానముఁ జేయుటకర్హంబై
మఱియుఁ జతురాశ్రమధర్మోచితంబైన గృహస్థాశ్రమమే
యాశ్రమరాజంబుగాకఁ దక్కినయాశ్రమంబులంత యు
చితంబులగునే. పురుషుఁడు దనకు సాధ్యాసాధ్యములైన
పనులు గుర్తెఱిఁగి చేయవలయు.

శ్లో॥ అఫలానిదురంతాని సమవ్యయఫలానిచ ।
అశక్యానిచవస్తూని నారభేతవిచక్షణః॥

తా. లోకంబున జ్ఞానవంతుఁడగు పురుషుఁడు నిష్ఫలము
లైనవియు, నంతములేనట్టియు, ఆదాయవ్యయములు సమములుఁ
గ నుండునవియు, శక్యముఁ గానివియు నగుకార్యములఁ జేయఁ
బ్రయత్నింపఁడు.

వ. కావున సాధ్యములుగాని కార్యములకుఁ బ్రయత్నము
సేయరాదు.

శ్లో కిన్ను మేస్యాదిదంకృత్వా కిన్ను మేస్యాదకుర్వతః ।
ఇతిసంచింత్యమనసా ప్రాజ్ఞఃకుర్వీతవానవా॥

తా. ఈకార్యమునుఁ జేసితి నేని నాకేమిలాభముగలుగును. చేయకపోయిన నేమినష్టము గలుగును. అని బుద్ధిమంతుఁడైన మానవుఁడు చక్కఁగా మనస్సుచేవిచారించి కార్యాకార్యముల యందు బ్రవృత్తినివృత్తులనుఁ బొందవలయును.

శ్లో॥ అర్థానర్థావినిశ్చిత్య వ్యవసాయంభజేతహ ।
గుణతస్సంగ్రహంకృత్వా దోషతస్తువివర్జయేత్ ॥

తా. జ్ఞానవంతుఁడగు పురుషుఁడు కార్యాకార్యములను నిశ్చయించి ప్రయత్నము సేయవలయును. సుగుణముండిన సంగ్రహించి దోషముండిన వర్జింపవలయును.

శ్లో॥ ఉచితమనుచితంవా కుర్వతాకార్యజాతమ్।
పరిణతిరవధార్యా యత్నతఃపండితేన ।
అతిరభసభృతానాం కర్మణామావిపత్తే ।
ర్భవతిహృదయదాహీ శల్యతుల్యోవిపాకః ॥

తా. జ్ఞానవంతుఁడగు పురుషునిచేత యుక్తములైనవిగాని యయుక్తములైనవిగాని కార్యములనుఁ జేయునపు డాకార్యములవలనఁగలుగు ఫలితార్థమును ముందుగాఁ బ్రయత్నముతో నిశ్చయింపఁదగినది. గుణదోషంబులను విచారింపక త్వరపాటుతోఁ గూడికొనిన కార్యకర్తలయొక్క కర్మపరిపక్వమంతటను దుఃఖకారణమై శల్యతుల్యమై హృదయమును దహింపఁ జేయునట్టిది యగుచున్నది. కావున యుక్తాయుక్తములను గుర్తెఱిఁగి మనుష్యుఁడు ప్రవర్తింపవలయును.

వ. కావునయాశ్రమరాజంబగు గృహస్థాశ్రమమే శ్రేష్ఠంబని భావంబునం బాదుకొలిపి నన్ను నీతోడంగొని చనినీవు గృహస్థధర్మం బంగీకరించితివేనిఁ దత్ఫలంబుననీకీమార్గం బుపదేశించిన నాకునునీకును జన్మసాఫల్యము గలుగునని పలికిన విని సుజనుండిట్లనియె. ఓ కచ్ఛపోత్తమా! మనుష్యజాతీయుండనగు నేనుఁ జేయుసుకృతంబునఁదిర్యగ్జంతువగు నీవెట్లు ముక్తిం బొందెదవు.

శ్లో॥ శుభకృచ్ఛుభమాప్నోతి పాపకృత్పాపమశ్నుతే ।

తా. పాపము సేయు పురుషుఁడు తన పాపఫలము నే యనుభవింపుచున్నాఁడు. పుణ్యము సేయు పురుషుఁడు దన పుణ్యఫలమునే యనుభవింపుచున్నాఁడు.

వ. కాన నెవరెవరి సుకృతదుష్కృతంబులు వారే యనుభవింపవలయుఁ గాని యితరులెట్లు పొందెదరనిన యా కచ్ఛపంబు బ్రాహ్మణున కిట్లనియె.

శ్లో॥ యాచితోయః ప్రహృష్యేత దత్వాచప్రీతిమాన్భవేత్ ।
తం దృష్ట్వాప్యథవా శ్రుత్వా నరస్స్వర్గమవాప్నుయాత్ ॥

తా. ఓద్విజవరా! యేపురుషశ్రేష్ఠుఁడు యాచింపఁబడినవాఁడై మిక్కిలి సంతోషింపుచు యాచితద్రవ్యము నిచ్చి పశ్చాత్తప్తుఁడు గాఁక యానందమునొందునో యట్టిసజ్జనునిజూచి యొక్కచారి

త్రమును వినినను వానితో మైత్రి సేసినను లేక చూచినను మనుష్యుఁడు స్వర్గమును బొందునని చెప్పంబడియున్నది.

వ. కావున మీవంటిసత్పురుషునిం జేరి యెల్లప్పుడు మీదర్శనముం జేయుచు మీరలొనరించు ధర్మములందనురక్తిగల నాకు ముక్తి కరతలామలకంబుగాదె మఱియు. "శ్లో॥ నీచంకులంకుప్యతి యాచకేభ్యః । మహాకులీనాస్తు భవంతి హృష్టాః" అనునట్లు యాచకులవలన నీచులగువారు కోపించుచున్నారు. ఉత్తములగువారలు యాచకులవిషయమయి యథోచితముగా నొసంగుటకు సంతోషముగలవారగుచున్నారు. ఇదియునుంగాక "దుఃఖిషు కరుణా, సుఖిషు అనుమోదితా, పాపిషు ఉపేక్షా, పుణ్యాకృత్సు మైత్రీ" యను నీనాలుగును మోక్షధర్మంబులు గావున నట్టిగుణంబులు మీయందలవడియుండుటవలన మీదర్శనంబు నాకు ముక్తిసాధనంబుగాదె.

శ్లో॥ కర్తాకారయితాచైవ ప్రేరకశ్చానుమోదకః ।
సుకృతందుష్కృతంచైవ చత్వారస్సమభాగినః ॥

తా. కార్యకర్తయును, కార్యమును జేయువాఁడును, ప్రేరేపించువాఁడును, కార్యవిషయమయి సంతసించువాఁడును యీనల్వురును యాకార్యపుణ్యపాపములను సమముగాఁ బంచికొనియెదరు.

వ. మఱియు.

క॥ జారుండై నను వృద్ధా।
చారుండై ననుగృహస్థసంచారుండై ।
శ్రీరామాయనిమొక పరి ।
నోరాడినఁజాలువానినూఱేఁడులకున్ ॥

వ. భూసురేంద్రా ! యీవిషయమయి విశేషంబుగాఁ జెప్ప నక్కఱలేదు. దానంబును, భగవన్నామ స్మరణంబును నను నీధర్మద్వయంబుచే సమస్తజనులును జతుర్వర్గ ఫలంబును జెందుచున్నారు. మఱియు ఫలకాంక్ష సేయని యెడల గృహస్థాశ్రమోచితంబైన నీ ధర్మంబు వలన శీఘ్రింబుఁగ భక్తిజ్ఞానవైరాగ్య సంపన్నులగుచు స్వానుభవంబుచే నిత్యానందమును బొందుచున్నారు.

క॥ ఇటువంటిభక్తి చేతను।
గుటిలంబగు చిత్తవృత్తిఁగోయకమున్నే।
పుటుకున జంటెముఁ ద్రెంచిన।
నటనలచే ముక్తిగలదె నరనుతచరితా॥

వ. సకలసుజనులచేకొని యాడఁబడుచున్న చారిత్రముగల యోసుజనుఁడా! మీబోఁటి మహాత్ములకుఁ గఱపనేనెంత దాన ననినవిని యాబ్రాహ్మణుండు తాఁబేలుసెప్పిన వా

క్యంబులకు ముదంబంది పెన్నిధిఁగన్న పేదకై వడి యా కచ్ఛపంబును దనకమండలువున నిడికొని మరలి తన స్వగృహంబున కరుదెంచి గృహస్థాశ్రమ ధర్మములం దత్యంతానురక్తుండయి యతిథుల కన్నంబు వెట్టి వారిం దృప్తినొందింపుచు నిత్యసంతుష్టితోఁ గూడికొనిపుణ్యాపురుషులచారిత్రంబుల చేఁగాలముఁగడుపుచుఁదదనుగ్రహంబునశీఘ్రంబుఁగ స్వానుభవానందభరితులగుచు బ్రాహ్మణుండును, కచ్ఛపంబును జన్మసఫలత్వంబు నొందిరి. కావున నన్నదానంబునకు సాటియగు దానంబేదియు లేదనిన విని యంబరీషుండు సంతుష్టచిత్తుండై తదనంతరంబ. దూర్వాసున కిట్లనియె.

ఓమునీంద్రా ; యన్నోదకదానంబు లొనర్పకమనుజుఁడెవ్వండేనియుఁ గేవలతపోనిష్ఠచే స్వర్గప్రాప్తుండైన వానికి దేవలోకంబున నెద్దియైనఁ గొఱంత గలుగునా యనిన రాజేంద్రునకు జటీంద్రుండిట్లనియె.

## { అంబరీషునకు దూర్వాసుండు శ్వేతుఁడను రాజర్షి చరిత్రము సెప్పుట. }

వ. తొల్లి కృతయుగంబున విదర్భాధీశ్వరుండగు శ్వేతుఁడనుభూధవుండు ధర్మంబుదప్పక రాజ్యంబేలుచు దానహీనుండయి కొంతకాలంబు గడచినపిదపఁ దనతోఁ

ఋష్యువగు సురదుని రాజ్యాభిషిక్తుం జేసి తపంబునం దిచ్ఛవొడమి శాంతాదిగుణగరిష్ఠుండయి తపోవనంబున కరిగి యందు మూడువేలవర్షంబులు ఘోరతపంబొన రించి శరీరంబువిడిచి తపోమహిమచే దేవత్వంబు వహి యించి దివ్యవిమానారూఢుండయి దేవాంగనాసేవనీయ మహామాధికుండగుచు రేయింబగళ్లు క్షుత్తృష్ణాపీడితుం డయి మహావ్యథచే నెద్దియుందోచక బ్రహ్మదేవునిసన్నిధి కరిగినమస్కరించి సరస్వతీపతీ! నేను దేవత్వంబుఁగాంచి యునాకలిదప్పులచేఁ దపించుచున్నాఁ డనందులకుంగార ణంబేమియనినఁ బితామహుం డిట్లనియె.

మ॥ నృపభావంబున రాజ్యమేలునపుడు న్నీవన్నదానంబు దా।
నపరత్వంబునఁ జేయవంబుకణమైనం దప్పిఁ గొన్నట్టివా।
రిపయిన్ గోట విదిర్చ వొక్కరుఁడ వుర్వీనాథ సాధుస్థితిన్।
దపములన్సల్పుచుఁ బ్రోవవేయతిథిదానం బుత్తునిన్నే చెడెన్

క॥ ఆఁకొన్న వారి రమ్మని।
తేఁకువ నన్న మిడువాఁడె దేవుఁడు దేవ।
త్వాకాంతుఁ జేయు తపములు।
ప్రాకటముఁగ నన్నదానఫలమున కెనయే॥

చ॥ అలసి శ్రమంబుతో నతిథియాత్మగృహంబున కేగుదెంచినం।
గలిగినమాత్ర మన్నముదకంబు నొసంగక సేదదీర్పకా।

యిలుసొరనీక తేమిటికినీడకువచ్చితివరిచుఁ గ్రూరుఁడై।
చలమునఁబల్కుదుష్టగృహిసచ్చిన నేమగునున్న నేమగుఁ॥

వ. కావుననర్థుల కపారంబుఁగ నన్నదానంబొనరింప సమర్థుండవయ్యు నొక్కని కేనియు నన్నమిడనిదోసంబుననిట్లార్తిం జెందుచున్నాఁడవు. కాన మనుష్యలోకంబున కేగి తొల్లి నీవువిడిచిన పాంచభౌతిక శరీరంబుకడ కేగియాకలి దీరునట్లా మాంసంబుదిని తత్సరోవరజలంబులఁ ద్రావి రమ్ము. ప్రతిదిన మిత్తెఱం గాచరించుచుండిన నాశరీరంబు దినదినంబునకు నశింపక పూర్ణత్వంబు నొందుచుండుఁ అంతటఁ గొన్నిహాయనంబుల కవ్వేటికి నగస్త్యమహర్షి యేతెంచు నమ్మహామునితో నీవు సంభాషించిన మాంసభక్షణంబు వదలునని చెప్పెననిన యంబరీషుండు సంశయచిత్తుండై స్వామీ? యాశ్వేతుని కళేబరంబు వృకాదిజంతువులచే భక్షింపఁబడకఁ జిరకాలంబెట్లుండెననిన దూర్వాసుం డిట్లనియె.

శ్లో॥ పృథివ్యాం యేదురాత్మానో దానహీనంభవంతిహి।
నభుంజతేసృగాలాద్యా మృతానపిక దాచన॥

వ. అను నార్యోక్తిప్రకారము ఓరాజేంద్రా? దానవిహీనులగు దురాత్ముల శవంబులను సృగాలవృకాదిజంతువులు భక్షింపవు. కావున శరీరంబు నిలిచియుండె.

అట్లు బ్రహ్మచేనియుక్తుండై శ్వేతుండు మర్త్యలోకంబునకేతెంచి మాంసభక్షణంబున నాకలిఁ దీర్చికొనుచున్న గొంతకాలంబున కచ్చోటికిఁ గుంభ సంభవుండగు నగస్త్యుండరుదెంచి యత్తపోవనంబు మనుజఖగమృగసంచార హీనంబై పల్లవకుసుమ ఫలభరితానేకతరుశోభితంబగుచు రమణీయంబగు సరోవరనిషేవితంబయియుండుట కాశ్చర్యంబంది యారేయి నచ్చటనివసించి మరునాడరుణోదయంబున స్నానార్థంబై యత్తపోవనంబున కరుగుతఱిఁ బరిపూర్ణాంగంబగు నొక్కకుణపంబు నీక్షించి యహాహా! యీ శరీరియెన్నఁడుదివంబునకేగెనో; యిదిజీర్ణంబుగాక యిట్లుండుటకుఁ గతంబెయ్యదియోయని విచారించుచున్న సమయంబుననొక్కదివ్యవిమానంబున నెప్పటియట్ల శ్వేతుండరుదెంచి విమానంబుడిగ్గినట యవనింబడియున్న శవమాంసంబుఁదిని తృప్తుండై యాకొలనిలోని నీరుఁద్రావి క్రమ్మఱ నద్దివ్యయానంబెక్కు సమయంబున నగస్త్యుండు గని ఛీ ఛీ యితండు దేవత్వంబునొందియు రాక్షసకృత్యంబొనర్చచనుచున్నాఁడీసంశయంబు నివారించికొనియెద నని యారాజు సమీపంబునకుఁబోయి.

క॥ హేయమగుమనుజమాంసము।
రోయకభక్షింప నాసురులకుఁదగుంగా।

కోయిమహాత్మకయిప్పని।
సేయఁగనీకగునెయనిన సిగ్గునసతడుఁ ॥

వ. అంతట శ్వేతకేతుండు నతశీర్షుండై కరంబులు మొగిడ్చి తన పూర్వవృత్తాంతంబెల్ల విన్నవించి బ్రహ్మదేవుండాన తిచ్చిన యగస్త్య మహామునింగాంచి నుతించి మఱియు నిటనియె.

ఉ॥ పాత్రులకుంజలాన్నములు భక్తినొసంగిమిఁజేసికాదెమ ।
ద్గాత్రముఁగోసికోసితినఁగావలసెం ననుఁబ్రోవుఁడీమణీ ।
చిత్రవిభూషణంబయినఁజేకొని యంచునొసంగునంతలోఁ ।
జిత్రముఁగానగోచరతఁజెందె శవంబతఁడుత్సహింపఁగన్ ॥

వ. అంత శ్వేతుండత్యంతానందంబున నగస్త్యునికి నమస్కరించి మహాత్మా? మీకటాక్షంబున హేయభోజన విముక్తుండనై తినని బహువిధంబులం బ్రార్థించి నగస్త్య నివలన సెలవొంది దివంబున కరిగెనని రాజర్షియగు శ్వేతకేతు చారిత్రంబు సెప్పినవిని వేదసమ్మతంబులగు దూర్వాసమహర్షి వాక్యంబులచే జనితవిశ్వాసుండయి యంబరీషుండు మునివిభున కిట్లనియె. మునివరా? లోకంబునఁ గొందఱు యోగాభ్యాసులయి వైరాగ్యంబునం బ్రవర్తింపుచుఁ బ్రాప్తవిషయ సుఖంబులం బరిహరింప నేరక సంతుష్టాంతరంగులగుచుందురు. వారికి ముక్తి

గలదా? యీ సంశయంబుఁ దీర్పుండని తత్త్వజిజ్ఞాసుం డై ప్రార్థించిన జటీశ్వరుండిట్లనియె. భూపతీ? నీవడిగిన ప్రశ్నంబతిదూరాలోచనీయంబై ననుఁ గొంతవివరించెద. యోగంబులభ్యసించువారు కామక్రోధాది శత్రువులం జయించి సాధనచతుష్టయ సంపదం జేకొని విషయసుఖం బుల నరకసమంబులు.గానెంచి సమలోష్ఠకాంచనులై శీతోష్ణాది ద్వంద్వంబులయందు సమతనుజెంది వెఱవక సంగరహితులై దేహేంద్రియమనః ప్రాణబుద్ధ్యాదులను మాయామయంబులని భావింపుచుఁ బ్రారబ్ధత్రయంబు నం బొందఁబడిన సుఖదుఃఖంబులను సహింపుచు జనన మరణంబులు దేహధర్మంబులనియు, శోకమోహంబులు మనోధర్మంబులనియును, క్షుత్పిపాసలు ప్రాణధర్మంబు లనియు నిశ్చయించి వెలుపల దేహేంద్రియాదులతోడఁ బ్రపంచధర్మం బనుసరించినట్లుండియు గురుకటాక్షంబు చే నిర్మలంబగునంతరంగంబున జన్మ, అస్తేయ, వృద్ధిఁ పరిణామ, పరిక్షీణ, వినశ్యత్వంబులనెడు షడ్భావంబులు లేక శుద్ధమై, స్వయంజ్యోతియై, నిత్యమై, యవికారి యగు నాత్మయెద్దియో దానిస్వరూపమే తానని లెస్సఁ గాఁ దెలిసికొని దృఢంబుఁగ మననమ్ముఁజేయుచు సహ జన్య, కర్మజన్య, భ్రాంతిజన్యంబులనెడి తాదాత్మ్య త్రయంబుచే విముక్తుండై జీవబ్రహ్మైక్య సంధానానంద

మకరందపానతుందిల మానసేందిందిరుండగుచుఁ దన్మ
యానందంబునం జరియించుచున్న మహాత్ములు జీవ
న్ముక్తులై యుందురు. జీవన్ముక్తేతరులెవరనిన.

శ్లో॥ జటిలోముండీలుంఛితకేశీకాషాయాంబరబహుకృతవేషః।
పశ్యన్నపిచనపశ్యతిమూఢో ఉదరనిమిత్తోబహుకృతవేషః॥

గీ॥ సర్వకర్మోపరతిఁగాక సంశయంబు।
దీరదామీదటనుగాని దివ్యమైన।
సుఖముతోఁ చదునాతోఁ చునుఖముదనకు।
వేరుఁగాకుండ వెలసె నాధీరుఁడగును॥

గీ॥ వెలిప్రపంచంబుమిథ్యని తెలిసితన్ను।
నెఱుఁగనేర్చిన యోగీంద్రుఁడింటనున్న।
యడవినుండిననా రెంటినడక సమమె।
గాఁక మఱియాత్మకీసటల్ కారణంబె॥

ఉ॥ అంబరయానసిద్ధులకునాసలుసేయుచు మంత్రతంత్రమా।
డంబరవృత్తిఁ గొందఱు విడంబము నొందుటఁగానిముక్తి చే।
తంబస లేదువారలకు భ్రామితసంసృతి వెంటనంటిలో।
కంబులఁద్రిప్పుచుండఁగడఁగానఁగనియ్యక రాజశేఖరా॥

క॥ ప్రాణాయామజయంబున।
మానవులుధరిత్రియందు మఱికొన్నేఁడుల్।

గానంగఁబడుదురింతే।
గానికలదె కాయశుద్ధికలలోనైనన్ ॥

ఉ॥ మాయలుసిద్ధజాలములుమాకదియేమిటికంచుఁజిత్తునన్ ।
పాయమువొందియొండొకటిభావనసేయకబాహ్యకర్మమం
దేయనువొందునైనమదికింపగు రీతినిసంచరించుని ।
ర్మాయికిహాయి గాకనడమంత్రపుయోగికిహాయికల్గునే ॥

క॥ ఈరాజయోగమార్గం ।
బేరేడుజగంబులందు నెవ్వరెఱుఁగరా ।
త్మారామలసదపాంగా ।
పారకృపాయుక్తులైన భక్తులుదక్కన్ ॥

వ. అనునట్లు మోక్షము భగవత్కృపాకటాక్ష సంవర్ధిత భక్తియుక్తులగు యోగులకును సులభంబుగాక నన్యులకు శక్యంబెయని మఱియు.

సీ॥ ఇంటితోనైనను నిల్లాలితోనైన
నగరికప్పలనైనఁ దెగువఁజేసి ।
కావికోకలుగట్టి కచ్చలుబిగియించి
బోడితలయై మెడపోచదీసి ।
కుండకోలయుఁబట్టి నిండుబూడిదెఁబూసి
పూసలుమెడఁగొన్ని వేసిచేత ।

జపమాలధరియించి జనులుగన్గొనుచోట
హరిహరియనుకొంచు నాడుకొంచు।
వేషమమరంగ భిక్షుకునింటవెడలి।
తిరిగియమరికగలచోట తినఁగమరిగి।
విషయసంగ్రతయంబుల విముఖులైన।
వారివలెఁదోచుచుందురు వసుధలోన॥

వ. ఇట్లు వెడలి కపటవేషధారులై నీకాఁకలిగాకుండునట్లాష ధంబొసంగెద. నాకుఁ గొంచెమన్నమిడుమని యడుగుచుఁ దామింద్రియంబులం జయింపలేక యాశాబద్ధులై.

శ్లో॥ ఆశాదాసాయతేయేషాం తేషాందాసాయతేజనః।
దాసాయతేయదాశాయ లోకానాంస్యాత్సదాసవత్॥

తా. ఆశయనెడి యొకసుందరి యెవరికి దాసియగుచున్నదో వారికి సమస్తజనులు దాసులగుచున్నారు. యేకారణమువలన నాశయనెడి సుందరికిఁ దాను దాసుఁడగుచున్నాఁడో యాకారణమువలన నాపురుషుఁడు సమస్తజనులకు దాసుఁడగుచున్నాఁడు.

వ. అహాహా! ఆశ బలవత్పిశాచము తనకేఁగాకుండ సమస్తజనులకు లోఁబడునట్లు సేయుచున్నది. అట్లాశాపిశాచావిష్టులై దేశభ్రమణంబుసేయుచు మేకవన్నెపులులో యన తలబోడి, పిడిజుట్లు, ద్వాదశోర్ధ్వపుండ్రంబులు. భూతిపెండెకట్లు, తులసీ రుద్రాక్షకంఠమాలలు, జప

మాలలు, భూతిపూతలు, కాషాయ వస్త్రంబులు, పాదు
కలు, వ్యాఘ్రమృగహరిణచర్మ దర్భాసనాదులు, యోగదండ
కమండలు కౌపీనధారులునయి కన్నులుమూయుచుఁ దెఱ
చుచు నిరతకరకుత్తులునై, పరిత్యక్త మాతాపితృకళత్రు
లును, చౌర్యద్యూతమధుపాన మదాయుచిత్తులును, ప
రాంగనాసంగ మాంతరంగులునునై యాత్మతుల్యులగు
దుష్టశిష్య బృందంబులతోఁ గూడికొని కామాంధమ
దోన్మత్తలును, లజ్జావిరహితలునగు విశ్వస్తలుకొందఱు
పరిత్యక్తబంధుజనలై తమ్ముంజేర వారలంగూర్చికొని
తృష్ణా. నిష్ఠులై విదేశగమనంబు సేయుచు వివిధవాక్యం
బుల లోకుల భ్రమింపఁజేయుచు సన్మార్గప్రవర్తనులగు
గృహస్థుల చెంతఁజేరి జీవేశ్వరైక్యజ్ఞానం బుపదేశించెద
మని కొన్ని వేదాంతయుక్తులఁజెప్పి భ్రమింపఁజేసి వార
లచే నపరిమిత ధనంబులందోచికొని వారల నిహాపర
దూరులం జేయుదురు.

శ్లో॥ శరీరవిషయాసక్తం వాచాబ్రహ్మేతివాదినమ్।
కర్మభ్రష్టోభయభ్రష్టో తంత్యజేదంత్యజంయథా॥

వ. అనుకీతి దేహాభిమానంబు వీడక విషయ సుఖాపేక్ష
వదలక వాఙ్మాత్రంబుచే నేబ్రహ్మానని చెప్పికొనుచున్న క
ర్మభ్రష్టోభయభ్రష్టుఁడగు పురుషునిఁ జండాలునివలెఁ

బరిత్యజింపవలయును. కాన నట్టివారు రుద్రాక్షపిల్లి వలె ధర్మంబులుపదేశించి తటవేచి ద్రవ్యంబునపహ రింతురనినవిని యంబరీషుండు సంతసిల్లి ఋషింజూచి రుద్రాక్షపిల్లియని వచించితిరి. తద్వృత్తాంతంబానతీయ వలయుననిన దూర్వాసుండతని కిట్లనియె.

## రుద్రాక్షపిల్లి కథ.

వ. నరేశ్వరా! వినుము. తొల్లినర్మదాతీరంబున నొక మార్జాలంబు మిగులవృద్ధదశలోనుండి యాహారంబు సంపాదించుకొన శక్తిలేక యొకదినంబునఁ దనమనంబున నిట్లనియోచించె. అయ్యో; వార్ధక్యంబున జిహ్వకింపుఁగా భుజించువారెట్టి పుణ్యాత్ములోగదా. నేను మహాపాపినై కష్టములనుభవింపుచున్నాను. యిప్పుడే యుపాయమ్మున సుఖముఁగా నాఁకలిదీర్చికొందునోయని చింతించి యాహా! పూర్వము యవ్వనకాలములో నేనువసించుచుండిన బ్రాహ్మణగృహంబునందు వినుచుండిన ధర్మశ్లోకంబులుకొన్ని నాకు కంఠపాఠంబులుగదా. యవి యీతరుణంబున నుపయోగించెదనని యాచెంతనుండు నొక మున్యాశ్రమంబులోఁ బ్రవేశించియందు రుద్రాక్షమాలిక నొకటి దొంగిలి దానిం దనమెడయందు ధరియించికొని విభూతిబూసి యరుణోదయకాలంబున

నై నర్మదాతీరంబు సేరి పక్షులు, మృగంబులు నచట మెదలు నపుడు వానింజేరంబిలిచి.

శ్లో॥ అనిత్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః।
నిత్యంసన్నిహితోమృత్యుః కర్తవ్యోధర్మసంగ్రహః॥

వ. అనునార్యోక్తి ప్రకారంబున ఓజంతు జాలములారా; వినుండు. ఆయుష్యము తరంగములవంటిది, యౌవన సంపత్తుకొన్నిదినములు మాత్రమేయుండును, ధనభోగంబులు మెఱుపులం బోలినవి, సంభోగాలింగనాది సౌఖ్యంబు లచిరంబులుగాన బ్రహ్మైక్యాను సంధానమే సంసార సముద్రము దాటుటకు సులభోపాయంబని దెల్పు చుఁ గొన్ని వైరాగ్యోత్పాదక శ్లోకంబులు జదువుచు నర్థంబుసెప్పుచుఁ బ్రతిదినమిట్లుండఁ బక్షులును, మృగంబులును యీ మార్జాలమహర్షి మహాత్ముండువీరిచేత నిత్యముఁ బ్రాతఃకాలంబున మన మందఱముం బురాణశ్రవణంబు సేయవలయునని యోచించి యుదయంబుననే నర్మదానదిలో స్నానముసేసి పండ్లు, దుంపలు శక్త్యానుసారముఁగాఁ దీసికొనివచ్చి యీ మార్జాల మహర్షికి నర్పించి నమస్కరించి ధర్మశ్రవణంబు సేయుచుండ నప్పుడా బిడాలంబు వేకువనే యన్నిటికన్న ముమ్ముఁగా స్నానంబొనర్చి జపరిబు సేయుదానివలెఁ గన్ను

లుమూయుచుఁ దెలచుచుఁ బురాణ శ్రవణమునకయి వచ్చినపక్షులను నుపదేశించెద సమీపంబునకు రమ్మని పట్టుకొని సందడిగాకుండ మ్రింగుచుండె నట్లుకొన్నిదినం బులుచన నొకగోమాయు వీసమాచారంబు బొదచాటు ననుండి పొంచి గమనించిచూచి పక్షులకెల్ల వెల్లడిసేసిన నవియెల్లభయంబంది ఓహో; ఇదిరుద్రాక్షపిల్లి కని పెట్టియుండుఁడని గుర్తిడికొనియుండెను. కావున యీ మహాత్ములు నట్టివారె. యిదియునుంగాకఁ గొందఱు న్నత్తమత్తేభయానలు కామంబుదీరక నిష్కామలవలె నభినయించి వేదాంతాభ్యాస మిషచే నిట్టి గురులంజేరి నానావిధాసహ్య కృత్యంబులొనర్చుచుందురు.

క॥ ఈరీతిఁబశుప్రాయులు।
నైరోష ద్వేషులై దురాచారులునై ।
వారునువీరునుమీమా ।
వారని స్త్రీపురుషవాంఛ వగచెడిరిన్నృపా ॥

వ. రాజేంద్రా! యిట్టికపటగురువులు దురాచారదుర్బోధ నలంజేసి తాముజెడునదిగాక నొరులనుఁజెఱిచి పరుల కేమైన దానముసేసిన దానిఫలమనుభవించుటకుఁ దిరుగా జన్మమెత్తవలయుననియు, కుంటి, గుడ్డి, ముసలివారలకుపకారములుజేసిన దేవునికిఁ కోపముకలుగుననియు

బోధించుచు తత్వజ్ఞులెవ్వరైన నిట్లుబోధించుటుచితంబు గాదన్న వారినిదూషింపుచు జనులను నరకకూపంబులం బడఁద్రోయుదురు.

గీ. ఇట్టిగురునిఁజేరి యెన్నిపోకలుఁబోవఁ
జిత్తశుద్ధిలేదు చింతపోదు
మాయమాయలాడిమటుమాయమంత్రాల
దోలఁగిపోదు యాత్మదెలియనీదు.

శా. సర్వజ్ఞత్వముగల్గియాత్మఁగనియుం సంసారదూరుండునై
నిర్వాణైక్యసమాధిమాత్రమువినా నేర్పెల్లతానెన్ననుం
గర్వగ్రస్తులుప్రాపుబ్రహ్మపదసాక్షాత్కారసౌఖ్యంబునం
బర్వన్నేరదుచిత్తమందు జయముంబ్రజ్ఞావిశేషాత్మకా.

ఉ. కాయమనిత్యమన్దలివిఁగానక మంత్రలయాదియోగసో
పాయములైనసిద్ధులనుఁబ్రజ్ఞలుఁగాఁదలపోసిమూఢులై
మాయలనందువారునదు మంత్రపుయోగులుగానిముక్తికిం
డాయఁగలేరువారలకుదంభమెమోక్షముతెంచిచూడఁగన్.

సీ. మానులై గొందఱు మాటలాడనివారుఁ
గొందఱుమంత్రముల్గొణఁగువారు
గొందఱుతీర్థయాత్రాందోళులగువారుఁ
గొందఱాకలముచేఁగుందువారుఁ

గొందఱ్రపొద్దులోకుల కేడ్చువారును
జలికివానకుఁగొందఱళుకువారు।
దపసులై కొందఱుతలక్రిందులగువారు
ముక్కులుగొందఱుమూయువారు।
నిన్ని తెఱఁగులనెందఱునెన్ని పాట్లఁ।
బడ్డసంసార మేఁగాని బ్రహ్మబోధ।
మార్గమదిగాదుసర్వంబుమఱచితన్ను।
సద్గురుత్వంబుఁగాఁగన్న జాణయోగి॥

వ. అని యీప్రకారంబున బోధించిన జటేంద్రుఁడగుదూ ర్వాసుంజూచి యంబరీషుండు స్వామీ! పారమార్థికం బుఁగా నొకరికి దానమొనర్చిన నరునకుఁబునర్జన్మంబు గల్గునా; యీసంశయంబు నివారింపుమనిన మునికుల తిలకుండిట్లనియె.

క. ఒరులకుదానమొనర్చిన।
పురుషుండిలఁబుట్టునెడిబోధకవర్యల్।
నరులాగిరులాతరులా।
ఖరులాహరులా సుదుఃఖకరులాదరులా॥

వ. అనిమఱియు.

సీ. కర్మముల్ సేసినఁగడ తేరఁగూడదు
సేయకుండినఁగతుల్ గాయకుండు।
చేసినకర్మంబుశివునకర్పింపుచు
ఫలసంగరహితుఁడై పరఁగవలయుఁ।
జేసియుఁగర్మంబు సేయకుండెడి నేర్పు
త్రిగుణభావంబని తెలియవలయుఁ।
గర్మంబులెవ్వనిఘననిత్యనైమిత్తి
కాచారనియమంబులంద్రుబుధులు।
ఫలము నేదైనఁద్రిగుణస్వభావమనుచు।
నైనయధికారములకొద్దినాచరింప।
వలయుగురువాక్యపద్ధతివరుసఁగాను।
వాత్మసాక్షాత్కరించుపర్యంతమధిప॥

సీ. తనవారిఁగన్నట్టుఁదనవారిఁగనవలె
సర్వభూతదయకుసాక్షిగాఁగ।
దనవంటియాఁకలేయనిపర దేశికి
ముందఱికూడైన పెందలాడె।
పెట్టంగవలయునుబీదయైవచ్చిన
యాతనికలకొద్దినంపవలయు।
స్నానపానాదులుసంధ్యాద్యనుష్ఠాన
మునుగల్గిలోకంబుననుసరించి।

నడుపవలయునుసర్వంబున[redacted]క్షవలనఁ।
దోచుచుండునునిదిమహాద[redacted]।
యిహాముమేలెంచనడచినవ[redacted]వారె।
పరముఁగాంచంగనేరురు। ప[redacted]॥

శ్లో॥ అదానదోషేణభవేద్దరిద్రీ । దరిద్రదో[redacted]పాపం ।
పాపాదవశ్యంనరకంప్రయాతి । పునర్దరిద్రీపునరేవపాపీ॥

తా. దానముసేయనిదోషముచే దరిద్రుఁడగును. దరిద్ర దోషముచే పాపమొనర్చును. పాపమువలన నరకమునొందును మరల దరిద్రుఁడయి పాపియగుచున్నాఁడు.

వ. అనునార్యోక్తిప్రకారంబున.

శ్లో॥ గృహేగృహేవిలుంఠంతి । భిక్షుకాఃపాత్రపాణయః ।
సూచయంతిహిలోకానా । మదాతుఃఫలమీదృశమ్ ॥

తా. భిక్షుకులు పాత్రలను హస్తములందిడికొని ప్రతిగృహమందును సంచరింపుచున్నారు. ఎందుకనఁగా; దానముసేయనివానియొక్క ఫలమిటువంటిదని యఖిలజనులకు సూచనసేయుచున్నారు.

వ. కావున.

గీ. చెల్లియుండియున్సైరణసేయునతఁడు।
బేదవడియునుసర్థికిఁబ్రియముతోడఁ।

దనకుగలభంగినిచ్చునతండుపుణ్య।
పురుషులనిచెప్పిరార్యులుబుధవరేణ్య॥

వ. ఓనరేంద్రా! తొల్లికమలసంభవుండు యమధర్మరాజునకుం దెల్పిన నన్నదానమహిమ నీకు నెఱుంగఁజెప్పెద సావధానచిత్తుండవై వినుము.

### అన్నదాన మహిమాను వర్ణనము.

గీ. ధరణినెన్నంగఁజనుమహాదానచయము।
లెన్నిగలవన్నిటికినెక్కుడన్నదాన ।
మర్కనందనయిదియెవ్వఁడాచరించు।
నతనిజన్మంబు జన్మంబుమదిఁదలంప॥

సీ. అధికదూరాయాసునజ్ఞాతకులబంధు
శ్రమసముద్భవఘర్మజలసమగ్రు।
ధూళిధూసరితగాత్రునిక్షుధ
మధ్యాహ్నకాలసమాగతత్మానుపర్వు।
నల్లంతటనెజూచియతనికులాచార
వర్తనలరయకమూర్తినున్న।
శ్రీవిష్ణుఁడనియాత్మఁజింతించియత్యంత
భయభక్తివినయసంభ్రమములెసఁగ।
నెదుఱుఁగానేగికొనివచ్చియుదకమిచ్చి।
యాసనంబిడియన్నపానాదులొసఁగి।

విశ్రమింపఁగననువుఁగావింపవలయుఁ।
బగటివేళయుమాపునభ్యాగతునకు॥

క. శ్వానమునకుఁజండాలున।
కైననునాఁకొన్నఁబెట్టనగునన్నముద।
న్మానైనగెడపఁదగద।
జ్ఞానంబునగెడపెనేనినరకమునఁబడున్॥

క. మాపటియతిథిన్ గెడపిన।
పాపమునకుమితములేదుభానుజయతనిన్।
గోపింపకభోజనశయ।
నోపేతముగాఁగఁబూజయొనరింపనగున్॥

క. వాఁకిటనిలిచినయతిథికి।
నాఁకలిఁదీర్పకభుజించునజ్ఞుఁడునరకా।
నేకశతాబ్దంబులునతి।
శోకంబునమలముమెసవుమన్వసియించున్॥

క. కావుననతిథిన్ గెడపక।
వావిరినిరతాన్నమొసఁగువానిదియిల్లా।
పావనుజన్మముజన్మము।
భావింపఁగవానిబ్రతుకుబ్రతుకుధరిత్రిన్॥

క. ఏగృహపతిచేనటన।
భ్యాగతుఁడుతిరస్కరింపఁబడునద్దురితం।
బాగృహపతికిడిచనున।
భ్యాగతుఁడుతదీయసుకృతమంతయుఁగొనుచుణ॥

క. ద్విజుఁడై యన్నమిడండా।
కుజనుండనిదలఁపవలయుఁగుజనుండైనం।
ద్విజునకునన్నంబొసఁగిన।
ద్విజవంశశ్రేష్ఠుఁడనుచుఁదెలియఁగవలయుణ॥

సీ. అన్నదానము సేయు నధికుఁ బ్రాతఃకాల
మునఁదలంచినదోషములు నశించు।
నన్నదానము సేయు నమలచారిత్రునిఁ
గనుఁగొన్నఁగలుష వర్గములడంగు।
నన్నదానము సేయు నతికృతార్థునితోడ
భాషింపఁదొలఁగుఁ బాపవ్రజంబు।
లన్నదానము సేయు నధికపుణ్యునిపాద
ధూళిసోకినఁబాయు దురితచయము।
లన్నదానంబు నిరతంబునాచరించు।
పరమపావనశుభగాత్రు ప్రస్తుతింతు।
భోజనము సేయువానికి భూప్రదక్షి।
ణంబొనర్చిన నన్ని పుణ్యములుగల్గు॥

సీ॥ కడజాతివానియాఁకలిఁ దీర్చినయతండు
గరమర్థి స్వర్గలోకముననుండు।
గృపచతుర్థునకు నోగిరమిడుధన్యుండు
తపనులోకమున మోదముననుండు।
నన్నంబువైశ్యుని కర్థిఁబెట్టినవాఁడు
చంద్రలోకమునఁ దేజముననుండు।
నృపకులోద్భవుని కెన్నికభుక్తియొసఁగిన
ఘనుడువైకుంఠ లోకముననుండు।
బ్రాహ్మణునకు భోజనాప్యాయనంబు।
నొందఁజేసిన పుణ్యాత్ముఁడూర్జితముఁగ।
నమరగంధర్వ సిద్ధయక్షార్క సోమ।
కామహరసత్య విష్ణులోకములనుండు॥

క. నిరతాన్నదాన మొసఁగెడు।
నరునింటఁజరించు పరిజనంబులు సహగా।
నరకముల తెరువుఁజూడరు।
హరిలోకమునందు నుందురధికవిభూతిన్॥

మ. గ్రహవక్రత్వముమానుఁ బీడలడఁగున్
గర్మక్షయంబొందువి।
గ్రహముల్ రావపమృత్యు దోషములువే
గంబాయు భూపత్యను।

గ్రహాముస్గల్గునని౦ జయుంబొదవులో
కఖ్యాతిచేకూరుఁబ్రబ।
త్యహాముందీనులకన్న దానమిడుపు
ణ్యప్రాణికిఁ సూర్యజా॥

చ. శరధితరంగమాలికలు సైకతజాలముల భ్రసింధు శీ।
కరములువర్షధారలు జగన్నుతతారకముల్గణింపఁగా।
నరిదియనంగ వల్వదదిమైన గణింపఁగవచ్చుఁగానియో।
తరణిజయన్న దానసుకృతంబుగణింపఁగరాదు లేశముఁ॥

చ. కపిలలుగాలచక్రములు కాంచనశైలములశ్వమేధముల్।
తపములుస్వర్ణధేనువులు దైవనివాసము లీశ్వరార్చనల్।
జపములుకూపముల్ నిధులుసామజఘోటక ముఖ్యదానముల్।
తపనజయన్న దానకబళంబు శతాంశముబోలదెన్నఁగఁ॥

చ. వరుణుఁడుబంపెబంపెగిరినైరి కుబేరుఁడుబంపెబంపెభా।
స్కరుఁడుడురాజువంపెఁ బురశాసనుఁడంపె నజుండువంపెమం।
దరధరుఁడంపెనంచును బ్రధానవిమానములన్న దాతకుఁ
బరువడిఁజూపిమెక్కుమనివల్కుదురందఱునందు దేవతల్॥

వ. అని యివ్విధంబున నైవస్వతునకు వాణీనాథుండెఱింగించెనని చెప్పి నృపకులోత్తమా? నీవును నన్నదానవ్రతం

బాచరింపుమని మునికులతిలకుండు వలికిన పులకాంకిత శరీరుండై పునః పునః ప్రణామంబులాచరించిన యంబరీషుని నాశీర్వదించి దూర్వాసుండు యథేచ్ఛంజనియెం గాన నో గృహస్థులారా? వినుండు.

శ్లో. దరిద్రాయకృతందానం । శూన్యలింగస్యపూజనమ్।
అనాథప్రేతసంస్కార । మశ్వమేధసమంవిదుః॥

వ. అను నార్యోక్తప్రకారంబు ననుసరించి.

గీ. కపటగురులపొత్తుఁ గలనైనఁ గోరక।
దేవునందుభక్తి తిరముసేసి।
కలకాలందిదాన కాంక్షులై సద్వృత్తి।
వెలయువారెముక్తి సులభులెందు॥

ఉ. పెద్దలసేవసేసినను బెంపగుఁగాకవృథాభిమానులై।
గద్దియనుద్ధులందగిలి గానక మూఢులుగొందఱుర్విలోఁ।
బ్రొద్దులువృత్తురట్లచెడిపోవక సామినిభక్తిఁగొల్చినన్।
దద్దయుమోక్షమబ్బుఁగద దాశరథీజనకాత్మజాధిపా॥

మ. ఉపవాసవ్రతశౌచశీల మఖసంధ్యోపాసనాగ్నిక్రియా।
జపదానాధ్యయనాది కర్మములమోక్షప్రాప్తిసేకూరదు।
చ్చపుభక్తింహరిఁబుండరీకనయనుంసర్వాతిశాయింరమా
ధిపుఁబాపఘ్నుఁబరేశునచ్యుతునినర్థింగొల్వలేకుండినన్॥

వ. మఱియుఁ బురుషోత్తముండగు శ్రీమన్నారాయణుండు మతవిరుద్ధంబులచే సకలజనులు చెడుదురని.

శ్లో॥ మద్భక్తశ్శంకర ద్వేషీ మద్వేషీశంకర ప్రియః।
తావుభౌనరకంయాతి యావచ్చంద్రదివాకరౌ॥

తా. నాకుభక్తుఁడయి శంకరుని ద్వేషించువాఁడును, నన్ను ద్వేషించి శంకరునకు భక్తుఁడయినవాఁడును, వారిరువురు సూర్యచంద్రులున్నంతవరకు నరకమును బొందుచున్నారు.

వ. అని దెల్పెనుగాన మీరు మతవైరాగ్యంబులుమాని హరిహరు లనేకభావంబునం జింతింపుచు పాషండుల దుర్బోధనలఁ జెవినిఁజొరనీక యథోచిత ధర్మజిజ్ఞాసుల రయి శమదమసత్యశౌచదయాది గుణగరిష్ఠులరయి.

మ. అరివర్గంబడగించి రాజసముఁ గోపాటోపమున్మాన్చిని।
ర్భరుఁడై యీషణవర్జితుండగుచు ధర్మంబాదిగాసాధనో।
త్కరముంగోరక నింద్రియంబులుఁదలంగంమాయనిర్జిం
చిభా।
స్వరుఁడైనంగోన చేతికబ్బదెటుమోక్షంబుజ్జ్వలద్రూపమై॥

వ. ఓజనులారా ? వినుండు. లోకోపకారంబుఁగా మధుమ క్షికంబు లనేకకుసుమ మకరందమ్ములంగూర్చి యొరుల

కిచ్చుపగిది ననేకపురాణేతిహాసాంతర్గతంబులయి శ్లోక రూపంబులగు నీతులంగ్రహించి యనుభవదృష్టాంతం బులుఁగా నొనర్చిన యీసుచరిత నీతిమార్గోపదేశ పద స్థులై బధిరశంఖానినాదమువలెను నంధకదర్పణ దర్శ నమువలెను నెన్నక నతిథులకై యన్నోదకదాన వ్రతం బాచరింపుచు సునీతిపరులరై యుండెదరని ప్రార్థింపు చున్నాఁడను.

శ్లో. ఆత్మాత్వంక్షితిజామతిః పరిజనాః ప్రాణాశ్శరీరంగృహం।
పూజాతేవిషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః।
సంచారఃపదయోఃప్రదక్షిణవిధిః స్తోత్రాణిసర్వాగిరో।
యద్యత్కర్మకరోమిత త్తదఖిలం రామాస్తుతేపూజనమ్॥

వ. అనునట్లు నాచేసేమేమి చేయఁబడుచున్నదో యాసమ స్తమును భగవదర్పణంబౌఁగాక.

క. ధీరంజనిమృదుపదవీ। ధీరంజనిశ్రవణమాత్రదివ్యశ్రేయో।
ధీరంజనియుపగతదు। ర్ధీరంజని వెలయుసత్సుధీరంజనియై.॥

క. లోకోపకారమునకై।
వాకొంటిబుధేంద్రములారవరగుణులారా।

[illegible] నుఁడు తప్ప[illegible]ను।
ప్ర[illegible]కటముగదిద్ది స్వ[illegible] పద్ధతి వెలయఁగ॥

గద్య॥ ఇది శ్రీసిద్ధ[illegible]శ్వర ప్రసాద సమాలబ్ధా
నవద్య వి[illegible] భవ నీలివంశోద్భవ
[illegible]ఖ్య తృతీయతనూభవ
పెంచలాహ్వాయ ప్రణీతంబైన
ధీరంజని సమాప్తము.
శ్రీ కృష్ణార్పణమస్తు.

